Regd No. N. 45 / M. 3289


గోలకొండ పత్రిక

సంవత్సరమునకు ౬-౦-౦
ఆరుమాసములకు ౩-౦-౦
విడిప్రతిక ౦-౧-౦

విదేశములకు

సంవత్సరమునకు ౧౪ షిల్లింగులు
ఆరుమాసములకు ౮ ,,

మరి:— ఆరుమాసముల తక్కువ కాలపు చందాకు పత్రిక పంపబడదు.


# గోలకొండపత్రిక


103278

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

సంపుటము ౧౨ | హైద్రాబాదు-దక్కన్ ౨౩ ఆజూర్ ౧౩౪౭ ఫ. శా. శ. ౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర ఆశ్వీయుజ బ॥ ౫ గురువారము | సంచిక ౮౫



గమనిక

ఈక్రిందిస్థలములలో గోలకొండపత్రిక విడిప్రతులు విక్రయించబడును.

హైద్రాబాదు
1. ఆంధ్రబుక్ డిపో, సుల్తాన్‌బజారు
2. ఆంధ్రశ్రీకంపెని ,,
3. భారతవస్త్రభాండార్ ,,
4. గణపతిభవన్ ఆబిదురోడ్డు

సికింద్రాబాదు
ఇ. నర్సింలు న్యూస్, యేజంటు 108 జేమ్సుస్ట్రీటు —చీఫు ఏజంటు


## మైసూరులో నిర్బంధములు

### నారిమెన్ అరెస్టు, విడుదల

### పోలీసు లాఠీప్రయోగము: తుపాకి కాల్పులు

("గోలకొండ" ప్రతినిధి)

మైసూరు అక్టోబరు ౨౩.

మైసూరు సంస్థాన ప్రభుత్వమువారు కాంగ్రెసు నాయకులపై కాంగ్రెసు సంస్థలపై విధించెడు నిర్బంధములు దినదినము హెచ్చుచుండుటచే ప్రజలందు అసంతృప్తి అధికమగుచున్నది. కాంగ్రెసు పతాక ప్రతిష్ఠాపనము వలన మహారాజా అధికారముపట్లను, మైసూరు జాతీయ పతాకముపట్లను ప్రజలకు గౌరవము, తగ్గుననియు, శాంతికి భంగ మేర్పడుననియు, ప్రభుత్వాధికారముపట్లను ప్రజలకు గౌరవము తలంచుటచే బెంగుళూరు నగరమునందంతటను పతాకప్రతిష్ఠాపనము కూడదని జిల్లామేజిస్ట్రేటు నిషేధించుచు కాంగ్రెసు నాయకు లందరిపైనను ఉత్తరువును అచరణలోనికి తెచ్చిరి. కాంగ్రెసు నాయకులగు నారిమెన్ గారి పైనను ఈ ఉత్తరువును అమలుపరచిరి.

#### నారిమెన్ అరెస్టు

"సభలలో ఉపన్యసించకూడదని జిల్లా మేజిస్ట్రేటు నాకు నోటీసు పంపినాడు. నేను కాంగ్రెసుసభ్యుడ నగుటచే ఈ ఉత్తరువును ఉల్లంఘించకూడదు. అయినను పరిస్థితులను గమనించుచు ఉత్తరువును ఉల్లంఘించుటకు నేను నిశ్చయించుకొంటిని. ఇది అవిధేయత యని భారత కాంగ్రెసు సంఘమువారు తలపరని విశ్వసించుచున్నాను" అని ౨౦వ తేదినాడు నారిమెన్ గారు విద్యార్థులసభలో నుపన్యసించుచు నుడివిరి. వీరు విద్యార్థుల కర్తవ్యమునుగూర్చి యుపన్యసించుచుండ పోలీసువారు వచ్చి అరెస్టు చేసిరి. ఇందువలన సభలో సంచలనము గలిగి, ప్రేక్షకులు పోలీసుపై చెప్పులను, రాళ్లను రువ్విరి. తత్ఫలితముగా పోలీసువారు లాఠీప్రయోగమును గావించుటచే కొందరు గాయములకు లోనైరి. నారిమెన్ గారిని సెంట్రల్ జేలులో నుంచిరి.

#### నగరమునందు హర్తాళము

నారిమెన్ గారి అరెస్టుకులన ౨౧వ తేదినాడు సంపూర్ణ హర్తాళము అమలు జరుపబడెను. విద్యాసంస్థ లన్నియు మూయబడియుండెను. ఇంటర్మీడియేటు కళాశాల తెరవబడిన కొం, సేపటికే విద్యార్థులు హర్తాళము జరుపుటకు నిశ్చయించి తోడి విద్యార్థులను హర్తాళమునకు దు చేయుటకై ప్రోద్బల మొసగుచుండగా ప్రిన్సిపాలు కోరికపై పోలీసువచ్చి లాఠీప్రయోగము ప్రారంభించగా విద్యార్థులందు ద్వేషము అధికమై రాళ్లు రువ్వుట ప్రారంభించుటచే ప్రజాసమూహముపై తుపాకులచె కాల్చుటకు అనుజ్ఞనొసగిరి. ఇందువలన ఆరుగురు విద్యార్థులు గాయములకులోనైరి. ఒక విద్యార్థి మరణించెను.

లాఠీ చార్జి, తుపాకుల కాల్పుల వలన ౬౦ మంది గాయములకులోనైరని తెలుపబడుచున్నది.

#### నారిమెన్ గారి విడుదల

నారిమెన్ గారు బెంగుళూరు సెంట్రల్ జేలులో యూరోపియన్ వార్డునందు నిర్బంధింపబడియుండగా, నగర మేజిస్ట్రేటు, జిల్లా మేజిస్ట్రేటులు, ౬ గురు పోలీసు ఉద్యోగులతో సహా ౨౧వ తేదినాటి సాయంత్రము ౫ గంటలకువచ్చి నారిమెన్ గారిపై యెట్టిచర్యయు జరుపగూడదని ప్రభుత్వము నిశ్చయించుకొనినదనియు, ఎట్టి నిబంధనలు లేకయే విడుదల గావించ నుద్దేశించుచున్నదనియు తెలిపిరి అతరువాత ఇద్దరు పోలీసు అధికారులు బెంగుళూరు తూర్పు స్టేషన్ వరకుగా సాగనంపిరి పోవునపుడు నారిమెన్ గారిని తోడ్కొనివచ్చిరి కాని నారిమెన్ గారు రాత్రి మెయిలులో పోవనుద్దేశించిరి అందుపై పోలీసుఉద్యోగు లెట్టిప్రదర్శనములు జరుగగూడదని తాముద్దేశించుచున్నామని తెలుపగా నారిమెన్ గారు అదేటేన్‌లో మదరాసు వెళ్లిరి.

#### నారిమెన్ గారికి వీడ్కోలు

నారిమెన్ గారిని సంస్థానము వెలుపలికి పంపివేయు యుద్దేశమును ప్రభుత్వము చాలా రహస్యముగా నుంచినను, కొందరు విద్యార్థులు స్టేషన్‌నకువచ్చి నారిమెన్ గారికి వీడ్కోలు నొసగిరి.

---

## ఫెడరేషన్‌కు ప్రతిఘటన

### కాంగ్రెసు మంత్రిపదవులు త్యజింపవలసి యుండును

### భూలాభాయి దేశాయిగారి అభిప్రాయములు

కలకత్తా అక్టోబరు ౨౬.

భారతదేశమునందు స్థాపింపబడనున్న ఫెడరేషన్‌ను విరోధించుటకు అవలంబింపదగిన విధానమునుగూర్చి పరిశీలించుటకై కాంగ్రెసుసంఘముచే నెలకొల్పబడిన ఉపసంఘ నివేదికను శ్రీభూలాభాయి దేశాయిగారు సిద్ధపరచియున్నారు. దేశాయిగారు భారత చట్టమునందలి అన్ని అంశములను వివరముగా చర్చించుచు ("ఫెడరల్ అసెంబ్లీకి సమప్రమాణ ప్రాతినిధ్య (ప్రపోర్షనల్ రిప్రెజెంటేషన్) పద్ధతిపై ఎన్నికలు జరుగనుండుటచే కాంగ్రెసు మంత్రివర్గములుగల ఏడురాష్ట్రములందును శాసనసభలందుగల అధికసంఖ్యాక పక్షమువారు ఎన్నికలందు పాల్గొనకున్నను, ఎన్నికలు జరుగకుండ నుండజాలవు కాంగ్రెసు పక్షమువారు ఎన్నికలందు పాల్గొనకున్నను, మహమ్మదీయులు, క్రైస్తవులు, యూరోపియనులు, వాణిజ్యాలు, ఇతర నియోజక వర్గములనుండియు ఎన్నికలు జరిగి, ఫెడరల్ అసెంబ్లీకి సాధారణ సంఖ్యాసభ్యులు యెన్నుకొనబడవచ్చును." అని సూచించిరి.

"భారత చట్టమునందుగల ఫెడరల్ భాగమును సూక్ష్మముగా పరిశీలించుటవలన దీనిని ప్రతిఘటించుటకు యెట్టి మార్గమును గోచరించుటలేదు. అయినను కాంగ్రెసు పరిపాలనగల యేడు రాష్ట్రములందును మంత్రివర్గములు ఫెడరల్ సమస్యపై తమ పదవులను త్యజించిరేని, రాజప్రతినిధి చట్టముయొక్క ౯౩వ సూత్రమునననుసరించి రాష్ట్రీయ శాసనసభలను రద్దుపరచుచు ప్రకటన గావించుటవలన ఫెడరల్ అసెంబ్లీ యెన్నికలు ఆగిపోవుటకు వీలుగలదు" అని దేశాయిగారు తెలిపిరి.

దేశాయిగారు తమ నివేదికయందు ఏడు రాష్ట్రములందు కాంగ్రెసు మంత్రివర్గములు పదవులను త్యజించినను ఫెడరల్ అసెంబ్లీ ఎన్నికలు జరుగుటవరకును రాజప్రతినిధి తమప్రకటనను గావించకపోవచ్చునని ఒక పక్షమువారు అభిప్రాయ పడుచున్నారనియు దీనికి భిన్నముగా మరియొక పక్షమువారు రాజప్రతినిధి యీవిధానము నవలంబింపడని తలచుచున్నారనియు సూచించిరి.

దేశాయిగారు ఈ విషయమున తమ అభిప్రాయమును తెలుపుచు ఫెడరేషన్ ఆచరణలోనికి రాకుండ నిషేధించుటకు ఏడు రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రులు తమ పదవులను త్యజించుకొని, ఇతర మంత్రివర్గములు పరిపాలనా భారమును వహించకుండ నిరోధించుటతప్ప వేరు గత్యంతరములేదని తెలిపిరి. ఇది యెంతవరకు సఫలతగాంచునో చెప్పుటకు వీలులేదనియు వీరు అభిప్రాయపడిరి. ఏడురాష్ట్రముల అధికసంఖ్యాక పక్షీయులు దీనిని ప్రతిఘటించుటవలన బ్రిటిషు ప్రభుత్వము అధమము కొన్ని విషయములనైన రద్దుపరచుకొనునదనియు, ఆ సమయమున కాంగ్రెసు బ్రిటిషు భారత దేశమునందు మాత్రమే ఫెడరేషన్ ఆచరణలోనికి రావలయునని కోరవచ్చునదనియు, ఇందు సంస్థానములు కొన్ని షరతులను అమలులోనికి దెచ్చినచో చేర్చుకొనవలయునదనియు దేశాయిగారు సూచించిరి.

---

## ఆంధ్ర మహాసభ రజతోత్సవము

### రాయలసీమ వాసుల రక్షణలు

(గోలకొండ ప్రత్యేక ప్రతినిధి)

బెజవాడ, అక్టోబరు ౨౫

నేడు శ్రీ టి ఎన్. రామకృష్ణారెడ్డిగారి అధిపత్యమున ఆంధ్రమహాసభా రజతోత్సవము జరుపబడినది.

ఆహ్వాన సంఘాధ్యక్షులగు కౌతరపు భావనారాయణశ్రేష్ఠిగారు ప్రతినిధులకు, ప్రేక్షకులకు స్వాగతమొసగిరి. శ్రేష్ఠిగారు ఆంధ్రమహాసభ ౨౫సంవత్సరముల కృషిని వివరముగా విశదపరచిరి వీరు తమఉపన్యాసమును ముగించుచు దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులుగారిని సమావేశ ప్రారంభమును గావింప కోరిరి.

శ్రీ వేంకటప్పయ్యగారు సమావేశమును ప్రారంభించుచు ఇట్లుపన్యసించిరి

"ఈనాడు మనయుద్యమమునకు ఇరువదైదు సంవత్సరములు నిండినవి. ఈ ఉద్యమము ఆంధ్రదేశము సర్వతోముఖముగా అభివృద్ధికావలయునను ఆశయముతో ప్రారంభింపబడెను. ఆంధ్రోద్యమమువలన మన కనేక లాభములు కలిగినవి కొన్ని సంవత్సరముల పూర్వము వరకు ఆంధ్రు లెవరో ఇతర ప్రాంతముల వారికి తెలియదు ఆంధ్రులకు ప్రత్యేక వ్యక్తిత్వమే లేకుండెను. ఒకానొకకాలమున సామ్రాజ్యము నేలిన ఆంధ్రజాతి ప్రతిభను నేడు ప్రతివారును గుర్తించియున్నారు. ఆంధ్రులందరిలో ఒకవిధమైన సర్వతోముఖ ఉద్వేగము బయలుదేరినది"

దేశభక్తుడు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, న్యాపతి సుబ్బారావుగారలు ఆంధ్రదేశమునకు గావించిన సేవను, ఉపకారమును ప్రశంసించిరి. వీరు ఉద్యమఉజ్జ్వల వివరములను విశదీకరించుచు, రాయలసీమవారికి జరిగిన అన్యాయములను విచారించుచు, ఆంధ్ర రాష్ట్రమునుగూర్చి కాంగ్రెసు మంత్రులు గనబరచుచున్న విముఖతకు తమ నిరసనభావమును ప్రకటించిరి

శ్రీ వేంకటప్పయ్యగారు తమ యుపన్యాసమును ముగించుచు "మొదట చిన్నదిగా నాచేత ప్రారంభింపబడిన ఈ యుద్యమము నేడు ఇంతటి మహోన్నతియందుండుట చూచుటకు నాకు మహానందముగా నున్నది ఇంతటితో నా జీవితాశయము అంతరించలేదు. ఆంధ్రరాష్ట్రము స్థాపింపబడినట్లు నేను నా జీవితములో చూచుటయే నా జీవితాశయము. దానికొరకె నేను జీవించియున్నాను. అట్టి ఆశయము త్వరలో చేకూరగలందులకై మన మందరము సర్వవిధముల పాటుపడగలందులకై మీ యందరిని నేను కోరుచున్నాను."

తరువాత శ్రీ రామకృష్ణారెడ్డిగారు అధ్యక్షపీఠమును స్వీకరించి తాము ఈసభకు అధ్యక్షత, వహించు సమయమునొసగినందులకు కృతజ్ఞత తెలిపిరి. వీరు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ప్రాముఖ్యతను, ఉద్యమ ప్రారంభకుల ఆశయమును వివరించిరి. ప్రత్యేక రాష్ట్రనిర్మాణమునందు రాయలసీమవాసులు చూపిన విముఖతకు కారణములను తెలుపుచు ఉత్తర సర్కారులవారు రాయలసీమయెడ ప్రకటించిన అపచారములు, ఉపేక్ష, నిరసనములతో, తమ స్వార్థములకే ప్రాముఖ్యతనిచ్చుటచే యీవిముఖత కలిగినదని తెలిపి వీరి సామరస్యము, సహకారమును సంపాదించుటకు దిగువ నిబంధన లవసరములని నుడివిరి:—

౧. రాష్ట్రమేర్పడుచో ముఖ్య పట్టణము మదరాసుగాని లేక రాయలసీమలోగల యే ...

౨. శాసన సభలయందు రాయలసీమకు నిర్ణీతసంఖ్యకంటె యెక్కువ ప్రాతినిధ్యము నొసగుట

౩ మంత్రుల నియామకములో ఉభయులకు సమాన ప్రాతినిధ్యము.

౪. రాయలసీమ అర్థికదుస్థితిని బట్టి తుంగభద్ర, కృష్ణ, పెన్నా మొదలగు ప్రాజెక్టులు తక్షణమే ప్రారంభించుట

౫. రాష్ట్రాభివృద్ధియందు సరిసమానముగ వ్యయమును జరుపవలయును.

శ్రీరెడ్డిగారు పైరక్షణలు ఆమోదింపబడెనేని నా రాయలసీమవాసులు వీరగ్రీవముగ విశ్వకాంధ్రముతో తీవ్రాందోళన సలుపుటకును, అవసరమగుచో త్యాగము సలుపుటకును సంసిద్ధులని ప్రకటి...

---

## కాంగ్రెసు కార్యవర్గ సమావేశము

### ఫెడరేషన్ ఆచరణయోగ్యముకాదని తీర్మానింపబడుట.

### కాంగ్రెసు మంత్రిపదవులను త్యజించకూడదని నిశ్చయింపబడుట.

#### మొదటి సమావేశము

కలకత్తా అక్టోబరు ౨౬.

నేడు మధ్యాహ్నము ౧౪ గంటకు అఖిల భారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సమావేశము శరత్చంద్రబోసుగారి భవనమున పండిత జవాహర్లాలు నెహ్రూగారి యాజమాన్యమున జరిగినది. సమావేశమునందు సర్దారు వల్లభాయి పటేలు, శ్రీమతి సరోజినిదేవి, భూలాభాయి దేశాయి, సుభాషుచంద్రబోసు, శంకరరావుదేవ్, అచ్యుత పట్వర్ధను, మౌలానా అబుల్‌కలాం ఆజాదు, సేటు జమ్నాలాలు బజాజ్, ఆచార్య కృపాలిని, జయరాందాసు దౌలతురాం, ఆచార్య నరేంద్రదేవు గారలు పాల్గొనిరి గాంధీ మహాత్ముడు సమావేశచర్యలను వీక్షించుచుండెను.

అధ్యక్షులగు పండిత నెహ్రూగారు తమ ప్రారంభోపన్యాసమునందు దేశపరిస్థితులను క్లుప్తముగా విశదపరచి, సభ్యులదృష్టిని కాంగ్రెసు మంత్రివర్గముల కార్యకలాపములవంక ప్రసరింపజేసిరి సమావేశము రాత్రి ౮ గంటలకు ముగిసి రేపు ఉదయము మరల సమావేశమగుటకు నిశ్చయింపబడెను. ఈ సమావేశమునందు సభ్యులు దేశ రాజకీయపరిస్థితులను విశదముగా చర్చించుచు తమ అభిప్రాయములను వెల్లడించిరి. రేపు రాష్ట్రీయమంత్రులతో కార్యవర్గసభ్యులు సంప్రతింపవలయునని నిశ్చయింపబడినది.

#### రెండవ సమావేశము

కలకత్తా అక్టోబరు ౨౭

నేడు ఉదయము నాలుగుగంటల కాలము కార్యనిర్వాహకసభ పండిత నెహ్రూగారి అధిపత్యమున సమావేశమైనది. ఈసమావేశమునందు ఫెడరేషన్ ఉపసంఘ నివేదికనుగూర్చి లక్నోనందు సమావేశమైన ముస్లింలీగునందు తీర్మానింపబడిన తీర్మానములవలన దేశమునందు సంచలనము గలిగించినట్టి "వందేమాతరం" గీతమునుగూర్చి, రాష్ట్రీయపరిస్థితులనుగూర్చి వివరముగా చర్చింపబడెను. మైసూరునందు విధింపబడిన కాంగ్రెసు నిషేధములనుగూర్చి చర్చింపబడెను. ఈసమావేశమునందు పై సమస్యలనుగూర్చి యెట్టి పరిష్కారమును రాకుండుటచే మరల పగలు రెండుగంటలకు సమావేశమగుటకు తీర్మానింపబడెను.

నేడు పగలు రెండుగంటలకు మరల కాంగ్రెసు నిర్వాహకవర్గసభ సమావేశమయ్యెను ఈసమావేశమునందు ఫెడరేషన్! మైనారిటీ జాతుల హక్కులనుగూర్చి రెండుతీర్మానములు గావింపబడినవి మొదటితీర్మానమునందు ఫెడరల్ ప్రణాళికను తీవ్రముగా ఖండించి, సంపూర్ణవ్యతిరేకత ప్రకటింపబడెను. జాతీయులను, రాష్ట్రీయప్రభుత్వములను ఈప్రణాళిక ఆచరణలోనికి రానీయకుండ విరోధించవలయునని కోరబడెను. ఈరాష్ట్రీయప్రభుత్వములు శాసనసభలయందు ఫెడరేషన్‌కు వ్యతిరేకముగా తీర్మానమును ప్రతిపాదించి అంగీకరింపజేయవలయును. ఫెడరేషన్‌ను ఆచరణలోనికి తేగూడదని బ్రిటిషుప్రభుత్వమును కోరవలయును అని కార్యవర్గసభ అభిప్రాయపడుచున్నది, అను తీర్మాన మంగీకరింపబడెను ఫెడరేషన్‌నుగూర్చిన ఉపసంఘనివేదికపై చర్చ జరిగిన పిమ్మట కాంగ్రెసు మంత్రిపదవులను త్యజించకూడదని అందరును అభిప్రాయములనొసగిరి. గాంధిమహాత్ముడును ఈ అభిప్రాయమునే బలపరచెను.

---

## కరోడ్గిరిశాఖోపాధ్యక్షులు

కరోడ్గిరి శాఖోపాధ్యక్షులగు గులాంముస్తఫాగారు ౧౬-౭౦ తేదిన, ప్రస్తుతము వీరు కరోడ్గిరి సంబంధనియమముల నిర్ణయించుచున్నారు. పెన్షన్ గైకొనుచున్నారు.

---

## ప్రభుత్వసభాధ్యక్షులు

కౌన్సిల్ సర్ హైదర్నవాజ్ జంగు బహద్దరుగారు సతీసమేతముగా నిజామాబాద, మెదకు పర్యటనమునుండి నేడు నగరము దయచేయగలరు.

---

## రైలుపెట్టెకు నిప్పంటుకొనుట

గతసోమవారం ఉదయము ౪-౧౫ గంటలకు ౭ డౌన్ గ్రాండు ట్రంకు యెక్స్‌ప్రెస్ బండిలో చింతలపల్లి నెక్కొండ స్టేషన్‌ల మధ్య, ౨౨౦/౯-౧౦ మైళ్ళ ప్రదేశమున యింజను ప్రక్క బండికి నిప్పంటుకొనినందున వెంటనే బండి ఆపబడి సామాను, ప్రయాణీకులు దింపబడిరి పెట్టము పూర్తిగా కాలిపోయినది. నష్టము రవమాత్రము కలుగలేదు బండి ౨ గంటల ఆలస్యమైనటుల చీఫుకమర్షియల్ మేనేజరుగారు తెలుపుచున్నారు.

---

## మహిళా మహాసభ

సర్ హైదర్నవాజ్ జంగు సతిగారి అధ్యక్షతక్రింద రేపు శుక్రవారం పురోద్యాన నగర భవనమునందు మహిళా మహాసభ ౧౧వ సమావేశము జరుగును. దుర్రెషహవార్, నీలోఫర్ రాకుమారితలు, మొకద్దిపతిగారలు పాల్గొనెదరు.

రామకోటు (హైదరాబాదు)లోని లేడీస్ రిక్రియేషను క్లబ్బులోని "స్విమ్మింగుబాత్" ను హర్ హైనెస్ బీరారురాజకుమారిత, 3౧ అక్టోబరు ౧౯౩౭ నాడు సాయంత్రము ౪౫ గంటలకు ప్రారంభోత్సవము జరుపనున్నారు.

---

## పురపాలక యెన్నికల అభియోగములు

స్మాల్ కాజ్‌కోర్టు (ఖఫీఫా)నందు మున్సిపల్ వ్యతిరేకముగా అభియోగములు తేబడినవి, మూడవవార్డు అభ్యర్థియగు ప్రేమ్, రెండవవార్డు అభ్యర్థియగు గుండేరావు హర్కారే, ఆరవవార్డు (అంబర్‌పేట) నవాబు మీర్ ఆహమదలీఖాన్‌పై అభియోగములు గలవు.

# ఆంధ్ర మహాసభాధ్యక్షుల పర్యటనము

## రామన్నగూడెము, రామవరం ప్రజల స్వాగతము

(ఒక విలేఖరి)

జనగాము ఆబాను ౧౩

### రామన్నగూడెము

మొంగ్రాయి యందల్పాహారము విందు తరువాత అచ్చటనుండి రెండుమైళ్ల దూరముననున్న రామన్నగూడెమునకు అధ్యక్ష మహాశయుడు పరిజనసహితముగా వచ్చెను. ఇది లక్ష్మక్కపల్లెయను గ్రామమునకు మజరా. జనసంఖ్య ౫౦౦. ఇచ్చట తురకలయిండ్లు లేవు. హరిజనులయిండ్లు మొత్తము ౧౫. వీరిలో తొమ్మిదియిండ్లవారు ఇటీవల జాజిరెడ్డిగూడెములోని మౌలానా అనునతని ప్రేరణముచేత మతాంతరులైరట. కాని మరల వారిలోనుండి కొన్నియిండ్లవారు మరల పూర్వమతము అవలంబించిరి. గ్రామస్థులగు రైతులు మొదలగువారు అధ్యక్ష మహాశయులను వారితోడి పరిజనమును గలసికొని తమకష్టసుఖముల వివరించిరి. ఇచ్చట చేరుబావిరీ భూములద్వారా రు ౬-లు (యకరమునకు), చేరుతలాబు భూములు రు ౧-౫ నుండి ౧౪వరకు కలదు.

ఇచ్చట పాఠశాల సర్కారువారిదిగాని, ప్రైవేటుదిగాని లేదు. కాని క్రొత్తగా తురకలైన మాదుగులకొరకు అంజుమను ఇస్లామియా వారొక పంతులు నేర్పరచిరి. ఈబడిపంతులు ఒక తురకబాలుడు అబ్బాసలి అని. ఆతనిచేత చదువువారిసంఖ్య బాలురు, బాలికలు కలిసి ౧౫ మంది. పిల్లలకు కుడ్తాలుమాత్రము అంజుమనువారిచ్చిరట. వీరిలో కొందరు కలమాలు చదివెదరు. అరబ్బి చెప్పుచున్నానని పంతులు చెప్పెను. ఉర్దూ అక్షరములుగాని తెలుగక్షరములుగాని పిల్లలకురావు. ముందు చెప్పెదనన్నారు.

కల్లుదుకాణాల సంఖ్య పూర్వముకంటె హెచ్చినది. త్రాగువారిసంఖ్య తగ్గినదట. కాని సర్కారువారికి వచ్చు అబ్కారీ ఆమదని మాత్రము పూర్వముకంటె చాలమించినదని చెప్పుచున్నారు.

హరిజనులవాడకువెళ్లి అధ్యక్షుడును తదితర మహాశయులను వారితో సంభాషించి వారికష్టముల దెలుసుకొనిరి. అధికారులు వచ్చినప్పుడు వెట్టిపని చేయవలసి వచ్చుచున్నదనియు, ప్రతిఫలమిచ్చుట అరుదనియు వారు మొరపెట్టుకొనిరి. తురకలలో హరిజనులకును, వారితోపనులగొను భూస్వాములకును కొంత యిబ్బందిగానున్నట్లు తెలియుచున్నది. గ్రామస్థులు పూర్వాచార పరాయణులు. మార్పులు చేసికొనుట కష్టము. వ్యవసాయసంబంధపు పనులు హరిజనులు చేయుచుండిన వానిలో కొన్ని పనుల పద్ధతి మహమ్మదీయమతమున కనుగుణ్యముగ నుండవు. హిందూ ఆచార వ్యవహారములను వదలుకొని జుట్టు, బొట్టు, మున్నగు చిహ్నములను వదలినవారు వ్యవసాయపుల పూర్వాచార సంప్రదాయములలో పనిచేయ నక్కరలేదు.

ఈ మతపరివర్తనమువలన గ్రామస్థులకు పనులచిక్కును, హరిజనులకు ఆర్థికములగు చిక్కులును కలుగుచున్నవి. మరల అధికారులు నవీన మహమ్మదీయులయెడ ఎక్కువ అభిమానము చూపుదురు. గ్రామస్థులకు ఒత్తిడి కలిగించుచున్నారనియు, ఇట్లుచేయుట న్యాయముకాదనియు, తమ మత సంప్రదాయములకును అనుశ్రుతములగు పద్ధతులకును భిన్నముగా విశ్వాసములతోనే హాలి మొదలగుకార్యముల జరుపుకొనవలయునని నిర్బంధించుట క్రమముకాదనియు జనుల మీద మొత్తముమీద మాలు అధికారుల ఒత్తిడి వారికి బాధాకరముగా నున్నది. గ్రామాధికారులు ఇటు ప్రజలకును, అటు అధికారులకును నడుమ ఒత్తిడిలో ఏమిచేయుటకును తోచక కష్టపడుచున్నారు.

ఇటీవల జనగాము తహస్సీలునుంచి గిర్దావరు జాహెబుపేర ౯ అబాను ౧౩౪౬ ఫ తారీఖుగల ఉత్తరములో నిట్లున్నది —

"రామన్నగూడెపు క్రొత్తతురక షికాయతు చేసినందున దువ్వం తాలూకదారుగారు, "క్రొత్తతురకలకు బలోతాధావ్యము సరిగా యిప్పించుట విధాయకమనియు, నీవు ఈ విషయమున జిమ్మేదారువనియు, తురకలుకోరిన్న మామగుల బలోతా తక్షణమే రైతులనుండి ఇప్పించవలసినదనియు, పూర్వమువలె వారికి సరిగా హాజ్రుదారునట్లు ఏర్పాటు నిగరాని చేయవలసినదనియు కఠినముగా హెచ్చరించియున్నారు. ఈవిషయమున పటేలేకాక గిర్దావరుకూడా జిమ్మేదారు. క్రొత్తతురకలయినందున వారిపైన విరోధము కలుగజాలదనియు, వారి జవాబుదారిపైన ఎట్టిబాధకము కలుగజాలదనియు, బలోతా సరిగా పూర్వమువలె యియ్యబడునదనియు ఒక కరారునామా పటేలుతోను, ఒక వసీకా క్రొత్తతురకలతోను తీసికొనవలసిన భారము మీపైనున్నది. ఈ రెండు కాగితములు ఈ మహాశయుడు ఒక వారము దినములలో పంపవలెను. ఏలయనగా, ఫిర్యాదు హుకుము బదులె అమలుజరుపుటకు సుబూతు ఉండవలెను. ప్రత్యేకముగా ఈవసీకాలు, ఆలస్యము చేయక తీసికొని అమలుజరుపవలయును. రిపోర్టు తామీలి, క్రొత్తతురకల యిత్తిలాయాబి వసీకా, పటేలు కరారునామా పంపవలెను." ఈ మురాసిలా నిహాబ్ ౨౭౭౫.

పై మురాసిలా మాలుజారిలోని ఉత్తమాధికారుల దృష్టికి రాదగియున్నది.

గ్రామములోని దరిద్రులగు హరిజనులకు క్రొత్తమతపు ప్రేరేపణ చేయుటయు, తన్మూలమున వారి కార్థికముగ నిబ్బందులు కల్పించుటయు గ్రామప్రజల శాంతజీవనమునకు అంతరాయముగా నావచ్చుచున్నది. ఈ అశాంతికి కారణముల తెలిసికొని, దానిని తొలగించుట ప్రజలకును ప్రభుత్వమునకును క్షేమకరమగునని గ్రామస్థులు చెప్పుకొనిరి.

ఈసంగతుల దెలిసికొనిన పిమ్మట మధ్యాహ్నము తరువాత అధ్యక్షమహాశయుడు పరిజనముతో ౪ మైళ్ల దూరముననున్న రామవరమునకువెళ్లిరి.

### రామవరము

ఈగ్రామపు జనసంఖ్య ౧౪౩౫. కోమటిండ్లు ౯, దూదేకులయిండ్లు ౪, మాలయిండ్లు ౧౦, మాదిగయిండ్లు ౫౦. ఈ యాభై యిండ్లవాండ్లు తురకలలో మూడువాల్లు మాసముల క్రిందట కలసిపోయిరట.

ఇచ్చట ఆరవాండ్లు అను హిందువులుకలరు. వీరు మహారాష్ట్రము మాతృభాషగా గలవారు. వృత్తి వ్యవసాయము. ఈ గ్రామమందును లంబాడీయిండ్లు గలవు. ఎరుకలవాండ్లుకూడ ఉన్నారు.

ఇచ్చట సర్కారీ పాఠశాలలేదు. పాఠశాల పెట్టవలసినదని దరఖాస్తులిచ్చిరట. క్రొత్త తురకల కొరకు అంజుమనె ఇస్లామియా వారొక తురక పంతులునుంచినారు. దీనిలో ౧౦-౧౫ మంది క్రొత్త తురకలపిల్లలు చదివెదరు.

వేరొక ప్రైవేటు పాఠశాల శ్రీయుత కడావు రామచంద్రరావు దేశముఖుగారు తమ పిల్లల కొరకు పెట్టించినదికలదు. దీనిలో ౧౫ గురు బాలబాలికలు కలరు. ఇద్దరు ఉపాధ్యాయులున్నారు. వీరిలో ఒకరు ఉర్దూనేర్పుటకు మహమ్మదీయ ఉపాధ్యాయుడు. వ్యయములు రు ౫౦లు రామచంద్రరావుగారే భరించుచున్నారు.

మరియొక ప్రైవేటుపాఠశాల రామరాజుగారు (క్షత్రియ) చెప్పుచున్నారు. దీనిలో ౧౪ మంది బాలబాలికలున్నారు.

చేరుబావిరీ భూములకును, ఇతర తరిభూములకును ధారలు తక్కిన సమీపగ్రామముల వలెనేయున్నవి. అబ్కారీ సంగతులుకూడ ఇతరగ్రామముల స్థితినిబోలియే యున్నది. అనగా ప్రభుత్వాదాయము (అబ్కారీది) హెచ్చుచున్నది. త్రాగువారిసంఖ్య తగ్గుచున్నది. ధర రెండింతలైనదని జనులు చెప్పుచున్నారు.

గొల్లయిండ్లు ౧౦ కలవు. తహస్సీలుదారుకు ౧ గొర్రెమాత్రము ఇటీవల ఇచ్చినాము. వెట్టి ఎక్కువలేదని వీరు చెప్పినారు. రెండుమూడు నెలలనుండి వెట్టి చాల తగ్గినదట (చాకలి మంగలివారుకూడ).

అధ్యక్షమహాశయుడు మాదిగగూడెములోని పాఠశాల చూడబోయినప్పుడు క్రొత్త తురకలనబడువారి సంగతులు తెలిసినవి. వారు గ్రామపు మాదిగవారేకదా. వాళ్లు నెలక్రిందట జాజిరెడ్డిగూడెము మౌలానా అనువారు వచ్చి ఒక శుక్రవారమువాడు మాంసముతో అందరికి విందుచేసెరనియు ఆనాటినుండి మతము మారినదనియు వారు చెప్పిరి. భూములు, జాగలు, ఇనాములు దొరకును అని చెప్పినందున మతము మార్చుకొంటిమని కొందరనిరి. అనేకులు తమ మారిన పేర్లెరుగరు. అనవారిమెడలలో పుస్తెలు అట్లేయున్నవి. "మాకు భూములు, ఇనాములు ఏమియు దొరకలేద"ని వారు బాలికలవలె చెప్పుకొనిరి. "పెద్దవారి పట్టాభూములు తీసికొని యిప్పిస్తామనియు, బంచరాయి భూములలోనుంచి భూములువిడదీసి యిప్పించుతామనియు ఎవరో గురువులన్నారు" అని కొందరనిరి. పూర్వము వీరు చనిపోయిన పశువుల మాంసముతిని చర్మములు గ్రామస్థులకిచ్చుచుండిరట. ఇప్పుడట్లు తినుటలేదు కనుక చర్మములు తిరుగయిచ్చుట వారికి నష్టము కావున యియ్యకనుచున్నారని రైతులు చెప్పిరి. ఇవిజనులు అధ్యక్షులతో సంభాషణలో చెప్పుకొనిన సంగతులు.

---







## గోలకొండ గ్రంథాలయము

"గోలకొండ"కు విమర్శనార్థము గ్రంథములు పంపేవారు రెండుప్రతులు పంపవలయును. ఒకటి విమర్శకులకు, ఒకటి పత్రికా గ్రంథాలయమునకు. ఒకేప్రతిగా వచ్చు గ్రంథములు విమర్శించుటలో ఆలస్యము జరుగవచ్చును. ఒకప్పుడు విమర్శించబడక పోవచ్చును. గ్రంథకర్తలు, ప్రకాశకులు విమర్శనార్థము రెండేసిప్రతులు బంపగలందులకు మా సూచన. — సంపాదకుడు

### హైదరాబాదు స్టేటు డైరెక్టరీ ౧౯౩౬ సం.

పుటలు సుమారు ౩౦౦
వెల కల్దారు రు ౫ లు
ప్రకాశకులు హైదరాబాదు డైరెక్టరీసు
స్టేషనురోడు సికింద్రాబాదు

శ్రీ ఎన్. ఆర్. మూర్తిగారు ఈ డైరెక్టరీ ప్రారంభకులు. ఇది మేజరుజనరల్ నవాబు అజంజాహబహదురు (యువరాజా) పోషకత్వమున ప్రకటింపబడినది.

ప్రచురణము మూడుభాగములందు విభజింపబడియున్నది. మొదటి భాగమున రాష్ట్రము యొక్క చారిత్రక, వ్యావసాయిక, పారిశ్రామిక, ఆర్థికసమస్యలు విపులముగా చర్చింపబడియున్నవి. రెండవ భాగమునందు హైదరాబాదు రాజధాని నగరము యొక్క ప్రకృతి దృశ్యములును, రాజ్యాంగ వివరములును, వ్యాపార విషయములును విశదపరుపబడినవి. మూడవ భాగమునందు రాష్ట్రమండలముల వివిధ విషయ వివరములు పొందుపరుపబడియున్నవి.

గ్రంథమునందు రాష్ట్రము యొక్క ఉన్నతాధికారుల, న్యాయవాదుల వ్యాపారుల చిత్రపటములు సుమారు ౨౦౦ వరకుగలవు. పుస్తకమంతయు ఆర్టుపేపరునందే ముద్రింపబడియుండుటచేతను, కాలికోబైండు చేయబడుటచేతను సుందరముగను, ఆకర్షణీయముగను గలదు. అచ్చుకూర్పు ప్రశస్తముగా గలదు.

ఏకారణముచేతనో ప్రజాప్రముఖులయొక్కయు, పరిస్థితులయొక్కయు, సంస్థలయొక్కయు ప్రాధాన్యత గ్రంథమునందొసగబడలేదు. ముఖ్యముగా ౫౦ లక్షల ఆంధ్ర ప్రజల ప్రాతినిధ్యతవహించిన ఆంధ్ర మహాసభను గూర్చిగాని ఆంధ్రసంస్థలను గూర్చిగాని యెట్టి ప్రసక్తియులేదు. ఇంతేకాక మహారాష్ట్ర, కర్ణాటక, మహమ్మదీయ సంస్థలనుగూర్చియు వివరముల నొసగినచో గ్రంథప్రాశస్త్యము మరుపడించియుండునను మాటలో సందేహముండజాలదు.

ఈ ప్రచురణమునందుల్లేఖింపబడిన సంస్థాన చరిత్రలసంఖ్య మితములై అసంపూర్ణములుగానున్నవి. ఇంతేకాక కొన్ని ముఖ్య సంస్థానములు, జాగీరులు వివరింపబడనేలేదు.

ఇందుకు కారణము ఉల్లేఖకులగు శ్రీ ఎ. వి. రత్నముగారు విదితపరచినట్లు "సంస్కృతకరణకు సహాయము లభించకుండుటయే" యని మేము విశ్వసించుచున్నాము. రాబోవు ప్రచురణమునందు ఈ లోపములు సవరణమగుననియు రాష్ట్రీయులనుండి "సంపూర్ణ సహకారము లభించుననియు మేము ఆశించుచున్నాము.

మొత్తముమీద ఇట్టి యుత్కృష్ట గ్రంథమును, ఉల్లేఖకులగు శ్రీ రత్నంగారు ఉదహరించిన పరిస్థితులందు సిద్ధపరచి పాఠకలోకమునకు నొసగినందులకు ప్రకాశకులగు హైదరాబాదు డైరెక్టరీసువారును, ప్రారంభకులగు శ్రీ ఎన్. ఆర్. మూర్తిగారును ప్రశంసార్హులు. వీరి యీ కృషిని సఫలతముగాకేసి, ప్రజాసమూహమునందు వారి ప్రయత్నమునకు ప్రోత్సాహము చూపగలందులకు రాష్ట్రీయులను ప్రార్థించెదము.

### ఆధారములు

కవి జనస్వామి కోదండరామశాస్త్రి
పుటలు ౧౧౦　　వెల ౦-౬-౦
దొరకుస్థలము గ్రంథకర్త, లక్ష్మీప్రెస్, తెనాలి

(౯) కథలు—
[illegible] ఏకథ స్వతంత్రముకే ఆయితే మెచ్చుకోదగినదే. ఈపాటు తెలుగు కథలలో స్వతంత్రము లేవో అనుకరణములేవో అనువాదములేవో నిశ్చయించుట కష్టమైపోయింది. ఈకథలు స్వతంత్రము విగానే కనబడుచున్నవి. సాంఘికసమస్యలను, కొన్ని కష్టస్థలములను ఎదుర్కొనుచు వివిధ కథలు చదువుటకు అహ్లాదకరంగా ఉన్నవి.

### గురుకట్నము

కవి మేడ్చాల సీతారామయ్య
పుటలు ౬౪　　వెల ౦-౨-౦
దొరకుస్థలము గ్రంథకర్త, పూళ్ల, పశ్చిమ గోదావరి జిల్లా.

ఇదొక చిన్న ఖండకావ్యము. ఒక దీనరాలు అనాథ, తనబాలుని విద్యాభ్యాసము చేయించుట, ఆ బాలుడు దరిద్రమై ప్రక్క గ్రామములో దినమునుబోయి చదువుకొనుట, తల్లి శ్రీకృష్ణభక్తురాలగుటచే బాలునితో ప్రతిదినము అన్నయై వచ్చి శ్రీకృష్ణుడు బాటలో ఆడుకొనుట, [illegible] ఈబాలుడు కృష్ణుడిచ్చిన పెరుగుకుండ తీసికొనిపోగా అందరు చూచుచుండగ అది యెంత తీసినను తరుగక [illegible] మూరి ఆ బాలుని ఆదరము కావించుట ఇది కథ. లోని యంశములు నీతులు సులభశైలిని వ్రాయబడినవి. బాలబాలికలకు భక్తి ప్రబోధము. వెలమొత్తము హెచ్చే.

# గోలకొండపత్రిక

ఈశ్వరనామ సం||ర ఆశ్వయుజ బ|| ౯

గురువారము


# ఈ 'అనవసర' వ్యయము

పట్టభద్ర మహాసభాధ్య పీఠము నుండి అన్సారిగారు విశదపరచిన ఉస్మానియా విశ్వవిద్యాపీఠ భవననిర్మాణమునకై జరుగుచున్న అపారధన వ్యయములో అధిక భాగము "అనవసరమైన" దనుట అతిశయోక్తి కాజాలదు. మన ప్రస్తుతస్థితులను, మన దేశపరిస్థితులను, మనముఖ్యావసరములను దృష్టియందుంచుకొని సమాలోచించినకైన, ఖుర్దాదు ౧౩౪౫ ఫ నుండి ౧౩౪౬ ఫ. ఆఖరువరకు రూ ౬౫,౫౦,౦౦౦ లు కేవలము భవననిర్మాణముకొరకై వెచ్చించుట నిజముగా "పన్ను చెల్లించువానికి న్యాయమొనర్చుట గాజాలదు." ఇంతవ్యయపరిచినను, ఇంతకాలము జరిగినను, పనిమాత్రము సంపూర్తియము కాలేదు. పూర్తియగుటకు మరికొన్నియేండ్లు పట్టగలవు. నిర్మాణాధికారులు ఉద్దమొదట ఖుర్దాదు ౧౩౪౧ ఫ. నుండి ౧౩౪౫ ఫ. ఆఖరువరకు మంజూరుచేసిన రూ ౭౦ లక్షలతోను. పూర్వసంవత్సరములలో వివిధ ప్రభుత్వ శాఖలకు మంజూరుచేయబడిన మొత్తములలో ఖర్చుగాక మిగిలినదానినుంచి క్రొత్తగా మంజూరుచేయబడిన కొద్ది మొత్తములతోను ఎట్లోయింతవరకు పనివెళ్లదీయుబడినది. ౧౩౪౭ ఫ. నుండియే పని మందగించెను. నిర్మాణ కార్యము యొక్క ఉపాంగములపై (Establishment charges) మొత్తము ఖర్చులలో నూటికి ౨౦ కన్న మించగూడదనుకొనబడినఖర్చు, ౧౩౪౫ ఫ.లో ప్రతిశతి ౨౧.౩ నుండి ౧౩౪౬ ఫ.లో ప్రతిశతి ౩౦.౯౩కి హెచ్చినది.

రూ ౯ లక్షల ౫౦ వేలతో తాత్కాలిక భవననిర్మాణము ౧౩౪౩ ఫ ఆఖరుకు సంపూర్తిచేయబడినది. ౧౩౪౪ ఫ.లో తాత్కాలిక భవనములకై రూ ౨౯౭౩౫౫ లు ఖర్చుఅయినవి, ఇంతఖర్చుతో నిర్మింపబడిన తాత్కాలిక భవనములను, నిజము చెప్పవలసివచ్చిన, "తాత్కాలిక భవనములనవ వీలులేదనియు, అవినిజముగా అస్థిర భవనములనియు, జాగ్రత్తగ ఉపయోగించిన ఎన్నియోయేండ్లు ఉండగలవనియు నిర్మాణకార్యము నడిపించుచున్న సూపరింటెండింగు యింజనీరుగారి యభిప్రాయము. స్థిరభవనములు పూర్తికాగానే, ఉస్మానియా విద్యాపీఠపువని ఉందులోనికి ప్రవేశపెట్టబడిపుడు, ఆతాత్కాలిక భవనములను లాభకరముగ మరియేపనికైనను ఉపయోగించుకొననిచో దానికై చేయబడిన ఖర్చంతయు వృథా కావలసినదే. ఎక్కడనో, నగరమునకు దూరముగ కొండలమధ్యనున్న ఈభవనములకు లాభకరమగు వినియోగము ఎట్లువచ్చునో చూడవలసియున్నది. తాత్కాలిక భవనముల ఆయుర్దాయముండునంతవరకు స్థిరభవననిర్మాణము సాగుచుండుట మూలమున ఉపయోగకరములు కావచ్చును, కాని ఇదిలాభమనిపించుకొనదు, అపేక్షణీయము కాదు.

ఈవిధముగ బ్రహ్మాండములైన రాజభవనములవలెకట్టించుటకై అధికవ్యయముచేయుటవల్ల డా|| మెకంజీకోటివారు లేటిప్పశిఖరాగ్రమునెక్కి క్రిందనుండు భవనములను చూచి కవిత్వధోరణిలో పడి ముగ్దులుకావచ్చును; ఈహైదరాబాదు నుచూడవచ్చు యాత్రికులు-ఆభవనములవరకుపోయినచో—"అబ్బో! ఇదియెక్కడినిర్మాణము!" అని ఆశ్చర్యపడవచ్చును; వారల ఆశ్చర్యములను సంతృప్తిపరచుచు మనము "విశ్వవిద్యాలయము యొక్క అమూల్యములును, బహువిస్తీర్ణములును నైన భవనములు కేంబ్రిడ్జి, ఆక్సుఫర్డు, అమెరికా, జపానువిశ్వవిద్యాలయ పద్ధతుల ప్రకారము విద్యాభ్యాసమునకు, విద్యార్థుల నివాసమునకు అనువగు ఏర్పాట్లతో కట్టబడుచున్నవి. ఈ ఉస్మానియావిశ్వవిద్యాలయమూలమున కర్తబా, బాగ్దాదు విద్యావిధాన గరిమ పునరుజ్జీవనమును, పాశ్చాత్యహైందవ మొగలాయి విజ్ఞానముల మేళవింపును గలుగునని ఆశించబడుచున్నది" అని బయటివారికిచెప్పుకొనివారల ప్రశంసలతో ఉప్పొంగిపోవచ్చును; కాని రాష్ట్రీయ ముఖ్యావసరములచే ఈవ్యయమును సమర్థింపజాలము. లేనిచో, నిరాడంబరములైన అలవాట్లను నేర్పవలసిన విద్యార్థులకు రాజసౌధములవంటి భోజనగృహమేల? ఈఖర్చుభారమును తర్వాత ఈ వసతిగృహములను, భోజనగృహములను అనుభవించు విద్యార్థులకు పంచవలసినచో, గొప్పగొప్పజాగీర్దారులు, నవాబులు ఈవిశ్వవిద్యాలయ విద్యననుభవింపవలసినదేగాని సామాన్యులు భరించుటకు సాధ్యముకాక ఒక్క నమస్కారముచేసి మెట్రిక్కు, ఇంటరులతోనే చాలించుకొనవలసివచ్చునేమో! ఈవిధముగ నిరుద్యోగులసు గ్రాడ్యుయేట్ల సంఖ్య భవిష్యత్తులో తగ్గవచ్చునుగాని, అట్లు తగ్గించుట సంతోషకరమైనసంగతికాదు.

నూతన విశ్వవిద్యాలయ భవననిర్మాణమునుచూచి ఈవిధముగ ననిన కలీమొద్దీన్‌గారు, ఇపుడు జరుగుచున్న హైదరాబాదు బాడుగేజిస్టేషనుపునర్నిర్మాణము చూచిన ఏమందురో! ఈ నిర్మాణమునకై ౩౪ లక్షల రూపాయలు ౧౩౪౪ ఫ.లో అసామాన్య వ్యయము క్రింద చేర్చబడినవి. తర్వాత దీనిపై ఎంతఖర్చయినదో తెలియలేదు. ప్రాతభవనమును కూలగొట్టుటకై పనిపనివాండ్రు పడుచుండిన కష్టమును అనేకులు ఆశ్చర్యముతో నోరుతెరచుకొని చూచిరి. అంతగట్టి ప్రాతభవనమును ఏల కూలగొట్టవలసివచ్చెనని కొందరు విస్మయపడిరి. కాని వారికి సమాధానమిచ్చువారెవరు? నాంపల్లి స్టేషనువద్ద వ్యాపారమేమైనను ఎక్కువయై, భవనమును పెంచవలసి వచ్చెనాయని కొంత ఆలోచనపోయినది. చూచుటకు అంతగా వ్యాపారము పెరిగినటుల కనిపించదు. ఒకవేళ పెరిగినను ఉన్న భవనములనట్లే యుండనిచ్చి క్రొత్త నిర్మాణముల జేసికొనుటకు వీలులేకపోయెనా? ఈచిత్రమునకు మరియొక సమాధానము తోచనందున, భవనాడంబరమును చూచి ఇతరులు హైదరాబాదును మెచ్చుకొనుటకు తప్ప, ఈపునర్నిర్మాణమునకై చేయబడినఖర్చుయొక్క ప్రయోజనమును సంశయించుటకు అవకాశము కలుగుచున్నది.

ఈఖర్చులతోటి ౧౩౪౪ ఫ.లో ప్యాలెస్టైన్ విశ్వ విద్యాలయమునకు ఇచ్చిన రూ ౧౨౫౦౦౦లను; టాగూరు గారి విశ్వభారతి కిచ్చిన రూ ౨౫౦౦౦ లను; పోయిన ౨౫ ఏండ్లలో న్యూఢిల్లీ చర్చికిచ్చిన రూ ౧౪౦౦౦ లను, ఢిల్లీలోని జుమ్మామసీదుకును అల్‌అక్సా మసీదుకును, ఇచ్చిన రెండులక్షలను, డేరాడూను పబ్లికుస్కూలుకు ఇచ్చిన రూ ౨ లక్షలను, చేర్చిచూడుడు. ఇవి స్థాలీపులాకన్యాయముగ గ్రహించబడినవేగాని పూటిపట్టికను సంపూర్ణముగ నీయలేదు. ప్రభుత్వమునుండి బైటిసంస్థలకిచ్చిన ఈదానములవల్ల మనరాష్ట్రముయొక్క ఆదాయమునందు అధికభాగమును పూరించు రైతులకు అనవసరమైనభారమా, మరేదైన వారలకుగణింపదగిన లాభముగలదా?

మనప్రభుత్వార్థికశాఖను రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారుపర్యవేక్షించినడిపార్టుమెంట లైజేషను సూత్రమునడిపించుచుండుటవల్ల, ఇట్టిఖర్చులు జరుగుచున్నను, మనరాష్ట్రపు బడ్జెటు ఎప్పుడును కావలసినంత మిగులును చూపుచున్నదేగాని లేనిచో చిక్కయ్యెడిదేమో! ఆర్థికమంత్రిగారు ౧౩౪౪ ఫ. బడ్జెటులో ఇట్లనినారు: "ఈవిధముగా వ్యయము ఆదాయముమేరకు పెరిగినది. ...ఇక ప్రభుత్వశాఖలు తమ పనిని వృద్ధిచేసికొనదలచిన, ఆర్థికశాఖఎక్కువ ద్రవ్యమొసంగునని ఆశపెట్టుకొనక, తమ త్రోవతామే చూచుకొనవలెను. అనేక శాఖలలో ఖర్చుతగ్గించుటకు అవకాశమున్నది." ఇక శాఖలనుండి ఏవైనను నూతన ప్రణాళికలకై ఆర్థికశాఖనుండి ద్రవ్యము కోరబడినపుడు, బహిరంగసభలు జరుపుకొనుటకు అనుమతికోరబడినపుడు కొందరు తాలూక్దారులు ఆసభలలో నొసగు ఉపన్యాసప్రతులన్నియు ముందుగా ఇవ్వవలసినదని కోరినట్లే, ప్రణాళికల, స్కీముల వివరములన్నియు, వాటిఖర్చుల వివరములతో సహా తెప్పించుకొని, రాష్ట్రముయొక్కయు, రాష్ట్రప్రజలయొక్కయు పరిస్థితులను అవసరములను దృష్టిలోనుంచుకొని, సంపూర్ణముగ విమర్శించి, అవసరమని తోచినవ్యయమునుతగ్గించు విషయమున, ప్రభుత్వమువారు ఎక్కువ శ్రద్ధ వహించగలరని నమ్మవచ్చును. బడ్జెటును విమర్శించు అధికారముగల సంపూర్ణప్రజాప్రాతినిధ్యమును వహించు శాసనసభ ఏర్పడినపుడు ఈప్రయోజనము ఇంకను చక్కగ నేరవేరగలదు.

## విందులలో ప్రధాన మంత్రిగారి ఉపన్యాసములు

మన ప్రధానమంత్రియగు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారి గౌరవార్థము జరుగుచున్నవిందులు వ్యర్థముగ పోవుటలేదు. అన్ని బాధ్యతలను మఱచి హాయిగా అనుభవించ వలసిన ప్రతివిందు సమయమునందును బాధ్యతను స్ఫురింపజేయు ఏదోయొక విషయమును ప్రధానామాత్యుడు ప్రస్తావించకవదలుటలేదు. కొద్దిరోజులక్రిందనే సికిందరాబాదు పౌరుల పక్షమున సమర్పించబడిన వినతి పత్రమునకు ప్రత్యుత్తరమొసగుచు, వారు ఫెడరేషను యెడ మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి వైఖరిని విశదపరచి, ప్రజలలో గల అనుమానములను తొలగించుటకు యత్నించిరి. దాని తర్వాత హైదరాబాదు సివిల్ సర్వీసు అసోసియేషనువారు గావించినవిందులో ఇచ్చిన ఉపన్యాసమందు ఉద్యోగుల నియామకపద్ధతినిగురించి తెలిపియుండిరి. ప్రభుత్వము ఏమి చేయుచున్నది అడిగి కనుగొనుటకును, కర్తవ్యమునుగూర్చి విమర్శించి నిర్ణయించుటకు గాకున్నను శిఫారసు చేయుటకైనను అధికారముగల విశుద్ధమైన (True) ప్రజాప్రతినిధి సభ (శాసనసభ)లేని రాష్ట్రములో ఈ విధముగ బాధ్యతగల ప్రభుత్వప్రతినిధులు సమయము దొరికినపుడు ముఖ్య ప్రభుత్వవిషయములను ప్రజలకు వెల్లడిచేయుచుండుట ఉపయోగకరము. దానివలన ప్రజలు, తెలుపబడిన విషయమును గూర్చి సరిగాఆలోచించుకొని, తమ అభిప్రాయములను, బహిరంగసభలకు సంపూర్ణసౌకర్యము లేక పోయినను పత్రికలమూలమున నైనను వెల్లడిచేయగలరు. ఆ విధముగనైనను ముఖ్యసమస్యలపై ప్రజాభిప్రాయము ప్రభుత్వమునకు తెలియగలదు.

ప్రస్తుతము "ఉద్యోగుల నియామకపద్ధతిని గురించి వారుచెప్పిన దానినిగమనింతము. ప్రభుత్వోద్యోగము లిచ్చుటలో ఆఉద్యోగమున పేక్షించివచ్చినవారలు ఏమతస్థులు అనువిషయమే ఉద్యోగులను నిర్ణయించు అధికారుల మనస్సులలో నుండరాదను సూత్రము తొలగించ బడదని హైదరిగారు స్పష్టముగచెప్పిరి. విద్య, గుణము, అపేక్షించిన పనిచేయుటకు సామర్థ్యము కల వారలందరికిని, జాతిమతవివక్షలేక, ప్రభుత్వోద్యోగమున కర్హతయుండ వలెనను సూత్రముకూడ తప్పకయుండవలసినదేయని హైదరిగారు నొక్కిచెప్పిరి. కాని, హైదరిగారు ప్రధానమంత్రిపదవికిరాగానే, కొన్నిరోజులకు. "కొందరు" (హిందూప్రజాస్థాయిసంఘ ప్రతినిధులను పేర్కొనుచున్నారు) వారికి తమ తెగవారియెడ పక్షపాతము జరుగుచున్నటుల సూచనచేసిరి, అనగా ప్రధానామాత్యుని సదాశయము, ప్రధానామాత్యుని వేయేల, ప్రభువరేణ్యుని సదాశయము (ఏలనన, పైన కోటేషనుమార్కులలో పెట్టినవాక్యము ప్రభువుగారు ప్రసాదించినమాటయే) అమలులోనంపూర్ణముగలేనట్లుకొందరికి తోచినదన్నమాట. అవును, సూత్రములకు విరుద్ధముగ కొన్నిసందర్భములందు జరిగియుండవచ్చునేమో? కనుకనే హైదరిగారు, "ప్రభుత్వోద్యోగములకు నియోగించునపుడు ఒక్కనిమిషమైననువర్ణము, మతము, తెగలను మనస్సుకు తెచ్చుకొనరాదు, దీనిని ప్రజలతోపాటుప్రభుత్వాధికారులును ఎంతత్వరగా అమలుపరచుదురో అంతమంచిది" అని హెచ్చరించిరి. అంతటితో నిడువక, ఇపుడు పైసూత్రములు సరిగా అమలు జరుగునట్లుచేయుటకునియమములు, నిబంధనలు ప్రభుత్వాలోచనలో నున్నవని వారు చెప్పిరి.

అట్టినియమములు, నిబంధనలనుఏర్పరచునపుడు, ప్రభుత్వముయొక్క ముఖ్యావసరము నెరవేరుచున్నంతవరకు, ఏ తెగవారికిగాని మొగ్గుపడునట్లు చేయనట్టి చిక్కులు నియమములలో ప్రవేశించకుండ చూచుట వివేకమగును. ఏదైనను ఉద్యోగము నపేక్షించి వచ్చువారలు నమ్మకమైన గుణము కలిగి ఆ ఉద్యోగమును చేయుటకు సామర్థ్యము కలిగియుండిన, ఆసామర్థ్యములలో ఉచ్చనీచభేదము లనుబట్టి ప్రభుత్వమువారు మొదటిపైమెట్టువారలనుగ్రహించుటకు అనుకూలపడిన చాలును. విద్యావంతుల సంఖ్య ఎక్కువగుచుండుటచే, ప్రభుత్వోద్యోగములను కోరుచు పూర్వముకంటె ఎక్కువమంది వచ్చుచున్నారు కావున, ప్రభుత్వోద్యోగములు చేయుటకు అవసరమగు అర్హతాంశముల ప్రమాణమును హెచ్చించవలెనని హైదరిగారు సూచించిరి. ఆహెచ్చించుటలోను ఏ తెగవారికిని మొగ్గుపడకుండునట్లుచూడవలెను. కానిఆసమస్య నెదుర్కొనుటకు దేశములో పరిశ్రమలు మున్నగు ఇతర జీవనోపాధులు లభించు అవకాశములను సమృద్ధిగాకల్పించి, రాష్ట్రపరిస్థితులనుబట్టి విద్యావైవిధ్యమునకు ఏర్పాటుచేయుట సరియగుమార్గమగును గాని, ప్రభుత్వోద్యోగుల అర్హతకు ఒకప్పుడొక ప్రమాణము ఇంకొకప్పుడు ఇంకొక ప్రమాణము ఏర్పరచుట సరియైన పద్ధతిగాదు. ప్రమాణ మెప్పుడును ఆదర్శప్రాయముగా పరిపూర్ణముగనుండును. కాని వచ్చు అభ్యర్థులలో ప్రమాణమునకు ఏమెట్టువరకు వచ్చుచున్నారు అను విచక్షణకు ప్రాధాన్యము ఉండవలెను. ఆదర్శప్రమాణ మెన్నటికి మారవలసినపని లేదనుకొందుము. కాని ఒక్కవిషయమును ర్చవలసియున్నది. అన్నింటను ముల్కీలకే స్థానముండవలెను.

నియమములు, నిబంధనలు ఏర్పరచిన పిమ్మటకూడ, ఆనియమముల ప్రకారము ఉద్యోగులను నిర్ణయించుపని ఆయాశాఖలకు వదలివేయక, ప్రత్యేకముగ నొకపబ్లికు సర్వీసు కమిషనును, సివిల్‌సర్వీస్ కమిషనువంటిదానిని ఏర్పరచుట అవసరము. ఏఏశాఖకు ఎట్టెట్టి సామర్థ్యముగలవారలు తగుదురో నిర్ణయించుటకు నిబంధనలుండును. పబ్లికు సర్వీసుకమిషను ఏర్పడిన తర్వాతగూడ ఒకప్పుడు అతృప్తి కలుగవచ్చును. కాని ఇప్పటికి తెలిసిన పద్ధతులలోకెల్ల అది యేకొంచెము గుడ్డిలో మెల్లయనిపించుచున్నది.

మొత్తముమీద విషయము ప్రభుత్వోద్యోగములకై ప్రయత్నించియుండిన అనుభవశాలురును, ఇపుడు ప్రభుత్వోద్యోగము లందున్నవారలును, ప్రజాప్రతినిధులును కలిసి, నిర్ణయమునకు ముందు సమగ్రముగా ఆలోచించదగినది. సంపూర్ణమైన చర్చలో సాధక బాధకములన్నియు, లెస్సగాచర్చించబడిన తర్వాత లభించు సంతృప్తికర పరిష్కారము మరియొకప్పుడు లభించజాలదు. ఈసమస్యను నిర్ణయమునకుముందే ప్రజలకు సూచించినందుకు హైదరిగారు వందనీయులు.

## జపానువారు బ్రిటిషువారికి ప్రతిఫల మొసగుట

ఇటీవల బాంబులవర్షముచేత బ్రిటిషు సైనికుడు మరణించుటచే జపాను ప్రభుత్వమువారు తమ విషాదమును వెలిబుచ్చుచు తగు ప్రతిఫలమొసగుటకు నిశ్చయించినటుల తెలియపరచిరి. జపాను కమాండరు యే విమానము,యే వైమానికునివలన యీఘోరము జరిగినదో కనుగొనుటకు తీవ్రముగా ప్రయత్నించుచున్నారు. ఇటులనే యింతకుపూర్వము జపాను వైమానికుల బాంబు వర్షముచేత యుద్ధమున జర్మనువారు మరణించినటులను, ఒక ఆశ్వము గాయపడినందున ప్రతిఫలము జపాను ప్రభుత్వమువారొసగవలయునని జర్మనీ ప్రభుత్వ ప్రతినిధి జపాను ప్రతినిధికి విశదపరచినటుల తెలియుచున్నది.

## జవాహరు, ఆజాదు రవీంద్రులతో సంప్రతించుట

"వందేమాతరం" ప్రజామిళిత కార్యక్రమముపై ముచ్చటించుట

కలకత్తా ౨౫ అక్టోబరు

నేడుదయము జవాహర్లాలు నెహ్రూగారు చేరగనే ఆజాదుతో రహస్యముగా ముచ్చటించిరి.

రేపు కార్యకారిణీసంఘ సమావేశమునందు చర్చింపబడు కొన్ని ముఖ్యవిషయముల గురించి పరస్పరముగా ముచ్చటించుకొనినటుల తెలియుచున్నది.

ముస్లింప్రజలను కాంగ్రెసునందు చేర్చుటకు జరుగుచున్న కాంగ్రెసు ప్రయత్నముల విషయమై మహమ్మదీయుల వైఖరి ఆజాదుగారినుండి గ్రహించుటకు ప్రశ్నించినటుల గలదు.

నేడు పాయంత్రము పండితుడు రవీంద్రుని తో కలిసి "వందేమాతర గీతము"గురించి ముచ్చటించినటులను, దానికి సమముగా మరొకగీతము జాతీయగీతముగా నుండదగినది విశదపరచుటకు కోరినటుల గలదు.

నేడింతవర కీ విషయము గురించి చర్చ ముగియనందున రేపు మహాత్ముడు వచ్చినపిదప తిరిగి యీ విషయముపై యిచ్చట చర్చ జరుపుటకు సమ్మతించినటుల తెలియుచున్నది.

## ఆల్వారు రాజద్రోహ నేరాభియోగము

ఆల్వారు ౨౫ అక్టోబరు

ఇటీవలన సంస్థానపు పోలీసువారు గామంది కాంగ్రెసు నాయకులపై నారోపింపబడిన రాజద్రోహ నేరవిచారణ నేడు జేలునందు ప్రారంభమైనది. ముగ్గురి వాఙ్మూలములు గైకొనబడినవి.

పీరిపై అడ్డసవాళ్లు వేయబడలేదు

మేజస్ట్రేటు ౪/౧౦౦ యిస్ పెక్టర్ రాజద్రోహసభ సమావేశ చట్టముక్రింద నేరమారోపించిరి. తిరిగి విచారణ ప్రారంభమగు రోజున నేరారోపితులు తమ వాఙ్మూలములను వ్రాతపూర్వకముగా నొసగుటకు తెలిపిరి.

## బ్రిటిషు సైనికులను తుపాకుల ప్రేల్చుట కాజ్ఞాపించుట

షాంఘాయి ౨౫ అక్టోబరు

ఆత్మ సంరక్షణార్థము యే సమయమందైనను యీ ప్రాంతమందలి బ్రిటిషు సైనికులకు విమానములపై తుపాకుల ప్రేల్చుటకు ఆజ్ఞయొసగబడినది. ఈ సైన్యమునద్ద పెద్ద మరఫిరంగులుగలవు. విమాన నాశనమునకివి చాల యుపయోగకరములుగా భావింపబడుచున్నవి.

## జపానువారికి అడ్డంకులు

షాంఘాయి ౨౫ అక్టోబరు

చీనావారు జపానువారికి కలిగించుచున్న అడ్డంకులు రోజురోజు క్రొత్తరూపము దాల్చుచున్నవి. అత్యుత్సాహముతో చీనా నోడించుటకు ముందడుగిడుచుండిన జపాను సేవలు ప్రతిరోధించుటకు చీనావారు మార్గములందలి వారధులు కూలద్రోయుట, దోవలలో గోతులు త్రవ్వుట, మురుగునీరుగల పొలములలో జపానువారి సైన్యము ముందు సాగుటకు వీలుకలుగకున్నది. ఇంచుమించుగా సుమారు ౧౦౦ జపాను విమానములు చీనావారి ప్రదేశములపై గుండ్లవర్షము కురిపించుచున్నవి.

## కాంగ్రెసు మాత్రమే: ఆదర్శ సాఫల్యత కలిగించును

ఇస్లాం కెట్టి అపాయము కలుగజాలదు

ముర్షిదాబాద నవాబుగారి సదభిప్రాయము

కలకత్తా ౨౫ అక్టోబరు

వర్తమాన పరిస్థితులలో దేశాభిమానముగల భారతీయులందరు శంకించవలెను దేశమందలి ముఖ్య సంస్థయగు భారత జాతీయ మహాసభకు సాయమొనర్చెదరని నాకు సంపూర్ణ విశ్వాసముగలదు. దీని మార్గదర్శకత్వముతోనే మన కాదర్శ సాఫల్యత సిద్ధించును"ని వంగదేశమందలి గొప్ప జమీందారులగు ముర్షిదాబాద నవాబుబహద్దురుగారు పత్రికాప్రకటన నొసరించిరి.

"నేడు దేశమునందు రెండిట్టి సంస్థలుగలవు. వీనియందేది భారతదేశమునకు, భారతీయులకు లాభదాయకమనునది నిర్ణయించు కొనవలయును."

వ్యక్తి లచ్చటచ్చట మహమ్మదీయుల కుపాయముగలదని బలుకవచ్చును. వీరందరొక ప్రత్యేకమహమ్మదీయ సంస్థక్రింద చేర్చబడుదురు, కేదేగాదు, ఎల్లప్పటికి యిస్లాంనకు ముప్పు గలదను విషయమంగీకరింప బడజాలదు. భూమండలమందలి సర్వశక్తులు దీని నాశనమే కోరినను యిదిమాత్రము సుస్థిరముగా నుండుట నిశ్చయము.

## ౧౦వేల మహమ్మదీయులు కాంగ్రెసునందు చేరుట

కొమిల్లా ౨౫ అక్టోబరు

మహమ్మదీయులు కాంగ్రెసుకు, జాతి ఆదర్శమునకు ప్రతికూలురను అపోహయొకటి ప్రబలినది. కొమిల్లాయందు ౧౦౦౦౦ మహమ్మదీయులు కాంగ్రెసు సభ్యత్వ మంగీకరించుటవలన పై విషయము కేవలము భ్రమాపూరితమని విశదమగుచున్నవి.

## బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనాహ్వానము

సంస్థాన ప్రజలకు నారిమెన్‌గారి ఉపదేశము

మద్రాసు ౨౬ అక్టోబరు

"ప్రజలు తమహక్కులను, సత్యములను సంపాదించుకొనుటకు మేల్కొనినటుల వారలను భరముల వలనగ్రహించగలిగితిని. ఇకముందు వీరెట్టి నిర్బంధ విధానమును, అక్రమ పద్ధతులను సహింపజాలరనుట నిశ్చయము. సక్రమనిర్మాణము, సరియగు నాయకత్వమున, దౌర్జన్య రహిత పథ మవలంబించి వీరు తమన్యాయపూరిత ఆదర్శమగు బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించి తీరెదరని"ని కె. ఎఫ్ నారిమన్‌గారు పత్రికా ప్రతినిధులతో తమ మైసూరు అను భవముల విశదపరచుచు తెలిపిరి.

"ఇతర సోదర సంస్థానములవారు తమ అభివృద్ధికి స్వయముగా ప్రయత్నించవలయును, మైసూరుప్రజల ప్రయత్నము తమ స్వంతము కొరకేగాక యావద్ సంస్థానములవారికి సూచికమై యున్నది. కావున కాంగ్రెసువారు సంపూర్ణ సామభూతి వీరియుద్యమ విషయమై కనబరచు టత్యవసరము"ని తెలిపిరి

# భావిభారతాభ్యుదయ కర్తవ్యము

## సంస్థానాధీశ్వరుల క్షాత్ర పౌరుష ప్రదర్శనము

బి. ఎస్. చంద్రశేఖరరావు గారు యావద్భారత స్వాతంత్ర్య సిద్ధికి కాంగ్రెసు నాహ్వానించుట

"భారతదేశమునకు "ఫెడరేషన్" అగమనముతో మైసూరు ప్రభుత్వమువారు తమ స్థానిక పరిపాలనాధికారులకు నిర్బంధ విధాన మవలంబించుట కనుమతించిరి.

కాంగ్రెసు సంస్థానముల విషయమై యాచరించుచున్న వైఖరి చూచుటకు న్యాయముగా, యుక్తరూపముగా గోచరించుచున్నను వాస్తవికమునం దది లజ్జాకరముగాగలదు. కాంగ్రెసు యింతకంటె, సంస్థానముల చేత్పుకొని, ప్రజా ప్రతినిధి సంస్థయని ధైర్యముతో విశదపరచి పెరుగరు. దేశమందలి మూడవభాగమును తన సంచలనము, యుద్యమమునందు చేరుపరచిన అఖిలభారత శ్రమనిర్మాణ సంస్థ మొత్తము భారతదేశ ప్రజాప్రతినిధియని ప్రకటించుకొనుట కర్తవ్యముండునా? సంస్థానప్రజలను వారిఖర్మములపై వదలుటచే నేడు తాటస్థ్యపద్ధతి(జోక్య రహితమార్గము) వహించిన కాంగ్రెసు విమర్శనాస్త్రమునకు గురికాకుండునా? ఇదొక విధమున నిరంకుశ ప్రవృత్తిగల సంస్థానాధీశ్వరులకు పూర్తి సాయ మొనరించుట యనవచ్చును. కాంగ్రెసునకీ సందేహాస్పదపద్ధతి యనుకరణీయమగునా? సాంఘికోద్ధరణము, రాజకీయ స్వాతంత్ర్యోద్దేశములకు యీమార్గ మసంగతము కాదా? జాతీయోద్యమమునం దభివృద్ధిపక్షము గలవారల, సామ్యవాదుల దృష్టి యీప్రశ్నలపై ప్రసరించుట యత్యవసరము.

సంస్థానాధిపతులు నేడలంకరించియున్న స్థానము, రాజకీయముగా, అతిహేయముగా గలదు. ఆర్థికరూపమున వీరి దర్శన్యయుగము నాటి దోపిడి గాండ్రమాదిరిగా గలదు. ఆధారగాగము ఒడసిన వేలకొలది సంవత్సరముల చరిత్రపుటలు దేశమునకీ సంస్థానాధీశ్వరుల వలన సంభవించిన పరాభవములు అవమానములు, సర్వనాశనప్రవాహముల వేనోళ్ల చాటుచున్నవి. వీరు క్షాత్రతేజ మున్నదవడు తమ క్షత్రియధర్మముతో నెల్లకాలము గర్వించుచుండిరి. కాని వీరు అపజయము, పరాభవముతో అవమానస్థితికి, విభేదము నుండి బలాత్కార అపహరణ కౌర్యమునకు పరిణమించుట నిందార్హముగా గలదు. మహమ్మదీయ విశేష సంకటనమువలన వీరివిధమునందు మార్పేమియు కలుగలేదు, స్వీయోద్దేశములకై దేశమును విక్రయించిన యీ సంస్థానాధీశ్వరుల నాహ్వానముపై ఆంగ్లేయులు భారతదేశమున కాలిడిరి.

దేశమునకు యీ సంస్థానాధీశుల, రమేశివాజి, రాణాప్రతాప్, ఝాంసీ లక్ష్మీబాయి తప్ప, దౌర్బల్య దుష్ప్రవర్తనల వలననే అపారదాస్య మేర్పడినది. నేడీ...... . వారే మనదేశమందలి మూడవభాగమును అత్రిక్రూరముగా పాలించుచున్నారు. జాతియొక్క భావి అభ్యుదయమునకు కళంకపూరితమగు యీ వర్గముతో సాయమగునని యాశించ వీలులేదు

సమకాలిక భారతమునందీ నిరంకుశపరాభవులు కాలవ్యతిక్రమపరులు. వీరివలన యేలాటి లాభము కలుగజాలదు. వీరు తమ జీవితములు హాయిమండి దుర్నీతి భోగ్యానుభవమునకు గడంగుటయే వీరిప్రయత్నము. దినమునుండి దినము, సంవత్సరమునుండి సంవత్సరమునకు ఆపులేక యథేచ్ఛముగా తిరుగుచుండు చక్రమునందీ పట్టిఅడంబులము, వింటాస్పద దుర్వ్యయ ప్రవృత్తులు స్వీయలాభాపేక్ష యిచ్చుకులతో, ముఖస్తుతిచేయువారలతో, సేవరింపబడి యున్నారు. పూర్వుల క్షాత్రముపై గర్వించుచుండు యీదీనస్థితియందలి కీలుబొమ్మల రాజప్రసాదావరణమునందు, నేడు వినయవిధేయము గలవారు గర్వించు, స్వాతంత్ర్యాదర్శము గుసగుసగా చెప్పుకొనుటకు వీలులేదు. కారాకారావరణమునందు నేడు అంతరంగిక కొట్టగడ నిర్మించుటకు వీరాహ్వానింపబడిరి గాంధీమహాత్ముడు రాష్ట్రీయస్వాతంత్ర్య ప్రదానానంతరము బ్రిటిషువారు లోకశత్రువులని పలుకుచున్నాడు. త్వరలో దేశముపై మోపబడనున్న ఫెడరల్ రాజ్యాంగము సంపూర్ణ జాతి పాలనమునందీ సంస్థానాధీశ్వరులకు జోక్యము కలిగించుకొను సత్వము ప్రసాదించుచున్నది. బ్రిటిషువారి సామ్రాజ్యమార్గమునకిది పొరపాటు గాజాలదు. సంస్థానవిషయములందు కాంగ్రెసు సంస్థాన ప్రజల స్వభావపూరిత ఆశయములవిషయములో కాంగ్రెసువారి శోచనీయమగు నిర్వ్యాపార పద్ధతి మానుకొనకుండిన నేడు మూడవభాగపు ప్రజల నణచివేయుచున్న చక్రమును జాతియంతయు మెడకు తగిలించుకొనుట నిశ్చయము. కాంగ్రెసు ప్రముఖులవలన యిటీవలనే కొన్ని ఆశాపూరిత వచనముల వినగలిగితిమి. కాంగ్రెసు యుద్యమముల నణచివేయుచున్న సంస్థానములకు ప్రతికూలముగా ధ్వజమెత్తుట కాలోచించుట యత్యవసరమని కాంగ్రెసు అధ్యక్షుడు ఢిల్లీలో విశదపరచెను. వల్లభాయివంటి ప్రాచీనసాంప్రదాయుడు సంస్థానము లంతమైతీరవలయునని గ్రహింపగలిగెను. "బ్రిటిషు భారతదేశసమస్య పరిష్కారి పఁడిన యీ సమస్య పరిష్కారమొందును రాజాలే వెళ్లగొట్టబడిన తత్క్షణమే యీ గాజులు నిష్క్రమించెదద"ని ఢిల్లీలో నొక రాజకీయ మహాసభయం దుపన్యసించుచు నుడివిరి. సంస్థానములందలి మేము యీ ప్రతికూల క్రియ యేరూపమున యెన్న దవలంబింపబడునో తెలియగోరుచున్నాము. సంస్థానాధీశ్వరుల సంరక్షణ కొరకు నముపై సర్వకాల మాధారపడియున్న సంస్థానాధీశ్వరుల కీలాటి భయోత్పాదక శబ్దములు గమనార్హములు గాజాలవు. కాంగ్రెసు సంచలనముల నణచివేయుటకు సంస్థాన ప్రభుత్వము అవలంబించుచున్న నిర్బంధప్రయోగముల రద్దుపరచుటకై కాంగ్రెసుకోరుటకు సంసిద్ధముగా గలదా? సరేయుయీ,యెగ్గుకు పారద్రోలగలదా? కాని యీరాజుల యునికియే రాజుల పాలనమున మదోహదమునది మీరు గ్రహించగలరా? ఆలా వదలివేయుటవలన యీసమస్యా పరిష్కారము గాజాలదు



వర్కింగు కమిటీయందు పాల్గొనిన గాంధి మహాత్ముడు

ఏడ్చువారికండ్లు తుడుచుటకో యనునటుల సంస్థానప్రజల విషయమేగాక యావద్భారతీయుల బంధించివేసిన దాస్యశృంఖలముల త్రెంచివేయుటకు సామాన్యోపేత కార్యాచరణమత్యవసరము. లేకున్న రాజగోపాలాచారి వంటి కాంగ్రెసు నాయకులు రాష్ట్రీయ శాసననిర్మాణమును మద్యపాననిషేధ యుత్సాహముతో భంగపరచుచున్నటుల ఫెడరేషన్ వక్రపద్ధతి గతిపట్టితీసును. శబ్దాడంబరోపన్యాసములు ఫెడరేషన్ ప్రవేశము ప్రతిరోధింపజాలవు. బ్రిటిషు సామ్రాజ్యత్వముకు కీజయము జాతియందలి మూడవభాగమును మధ్యయుగ నిరంకుశ పాలనములో నిరంతరదాస్యమునందు బంధించియుండుటవలన కలుగును. సామ్రాజ్యత్వపద్ధతి నిరోధమున కేమార్గమత్యవసరమని భావించువారికీ విషయము సందేహాస్పదమా? సౌధమును నిర్మూలపరచ నిశ్చయించిన పునాదిరాయిని పెకిలించుట ముఖ్యము

సమూలమార్పు లభిలషించు కాంగ్రెసు వాదులలోనిపారీయుద్యమమును బూనుకొనవలయును. హరిపురము కాంగ్రెసు మహాసభయందు నిశ్చయింపబడుట కీవిషయమును రేపు సమావేశముకానున్న అఖిలభారత కాంగ్రెసు కార్యకారిణీ సభయందు ప్రవేశపెట్టవలయును. స్వాతంత్ర్యసమరమునకు నిశ్చయించిన ప్రజాహితసంస్థ సంస్థానములందు బాధ్యతాయుతప్రభుత్వ స్థాపనకు నిశ్చయించుకొనిన ఆయా ప్రజల యుద్యమములకు చేయూత నొసగుట తప్ప మరొక గాఢవిషయ మంచ వీలులేదు. స్వతంత్ర ప్రజాయుక్త భారతమునందు మధ్యయుగాటి విశేషముల కేలాటి తావు నొసగబడదనుట నిశ్చయము.

ఇం ఇండియా

## హెర్ బక్ట్రాప్పు, మసోలీని సంప్రతింపులు

జర్మని వలసప్రదేశముల వదలుటకు కోరుట

ప్యారిస్ ౨౫ అక్టోబరు

ఇటీవల రోమునగరమునందు మసోలిని, హెర్ బక్ట్రాపుమధ్య జరిగిన సంప్రతింపుల వివరములు లెజోర్ యను పత్రికయందు ప్రకటింపబడినవి. వలసరాజ్యముల కోరికలవివరములు త్వరలోనే బర్లిన్లో ప్రకటితములగును దీనివలన జర్మనికి కెమరూన్సు, ఐదాగోండి (?) ప్రదేశములు, ఆఫ్రికాయందొక అంతర్జాతీయరాష్ట్రమేర్పడుననియు, దీనివలన యిటలీ, ఫ్రాంసు, జర్మని, బ్రిటనులకు లాభముకలుగుననియు, బర్లిన్ నగరమునందొక ప్రత్యేకకార్యాలయ మీవిషయమున స్థాపింపబడునని హెర్ బక్ట్రాపు విశదపరచినటుల తెలుపబడినది

ప్రపంచ యువకులు

౨ వ పేజి తరువాయి

టకు బూనకొనరు. ఒకేసారి ప్రయాణీకుల మాదిరి యుభయులు — వృద్ధులు, యువకులు సత్ప్రవర్తకులై సగౌరవముగా మెలగుచుందురు.

స్త్రీలసంబంధములో యువకు లవలంబించుచున్న ప్రవర్తనము పూర్వముకన్న యుత్కృష్టము గాగలదు. ఈవిషయము నిజముగా ఆదర్శప్రాయమనవచ్చును. ఇది యువతీ జనమునకొక నవీన సంకటమేర్పరచుచున్నది. దేశమునందు నేడు యువకునికన్న యువతికి సద్యోగము వాయాసముగా లభించు సౌకర్యము లనేకములు గలవు. దీనివలన దేశమునం దుద్యోగార్థా ముగల భర్తలసంఖ్య నిరుత్సాహపూరితమగుచున్నది. జీవితమునకు సౌందర్యమేగాక నితరములేర్పడవలయునను విషయ మొకటి బహిర్గతమగుచున్నది రాజకీయములందు ఆర్థికములందు సాంఘికవిషయములందు, వేయేల దేశసౌభాగ్య సంరక్షణార్థము ప్రతివిషయమునందు యువకుల త్యుత్సాహముతో నిర్నిలాపేక్షితులై నాల్గొనుచున్నారు. ఓటింగువిషయములో విచక్షణాజ్ఞానసాయము బడయుమార్గము వీరికి గ్రాహ్యము. ప్రతివిషయమునందు బాధ్యతవహించి ప్రవర్తించుచుందురు రాజకీయములందు, పారిశ్రామికములందు ప్రదర్శితమగుచున్న వీరియమితోత్సాహము వీరి బుద్ధిజ్ఞానముల వణమునేమోయను సందేహము స్ఫురించుచున్నది. ఏదెట్లులైనను నేటి సాంఘిక సౌఖ్యజీవనమునకు వీరాధారభూతులనుట నిర్వివాదాంశము ఇంతేగాదు, భావికాలము నందీనాటి పరిస్థితులలో మరింత యానందదాయకమై పరిణమించునని వర్తమానమేచాటుచున్నది.

## అమెరికా

ఈదేశపు యువకులు తరుచుగా నూరేగింపులను, బ్యాండువాయిద్యములను నిరీక్షించుచుందురు. ఇచ్చటి యువకునాచరణానురక్తి తనజీవితము కార్యానువర్తకముగా కొనసాగించుచుందురు, "ఏదైననొక ప్రత్యేకొదర్శ మేర్పడినదాని సాధనయే నాజీవితోద్దేశము"ని ప్రపంచమునకు విదితపరచుచుందురు, పదునైదు వత్సరములకుపూర్వ మీ యాసక్తత, సాధన యువకులందేర్పడి లేకుండెను. ప్రపంచమునందు జరుగుచున్నదానికి బాధ్యత మాపైనుండజాలదనియు జరుగుచున్నదటులనే జరుగనిచ్చుట శ్రేయోదాయకమనియు, తమపూర్వు లొసర్చిన పొరపాటునుండి ప్రపంచమును కాపాడజాలమనెడు విచిత్రభావములు క్రీశ ౧౯౨౦ సం॥ము వరకు యువకులలో నిబిడీకృతములైయుండెను కాని నేటి పరిస్థితులువేరు. వీరియందు చాలా మార్పు జరిగినది నేడు పూర్వముమాదిరి యువతీయువకులు తటస్థులుగా నుండజాలరు, తటస్థులుగా నుండువారికి దేశమునందు పలుకుబడి యేకలుగదనుట నిశ్చయము. ప్రతికార్యమునకు ముందంజవేయుచుందురు. యువకులు స్వయముగా నూరేగింపుత్సవముల నేర్పాటుచేయుటలో నసమర్థులనవచ్చును. ఎటులచేయవలయునో, ఏల సలుపవలయునో వీరికయోమయముగా నుండును. సాంఘికోద్యమ నాయకులేదైన యాదర్శము ప్రదర్శించినవెంటనే దానిసాధనకై తన్మయులగుట వీరికి స్వభావముగాగలదు ఇట్టి పరిస్థితియందాతతో బాటు ప్రమాదముసహితము గలదు. నేడు ప్రపంచమును కలవరపెట్టుచు ప్రజలదృష్టి నాకర్షించుచున్న ప్రవాహము—సామ్యవాదము—నందు వీరు దరిగానజాలక కొట్టుకపోదురేమో యనెడిదే ప్రమాదముగా గలదు. ఇచ్చటి యువతీయువకులు కార్యాపేక్షితులగుటంజేసి సామ్యవాదము వీరికాకర్షణీయముగానుండు. కార్యముతప్పక నిర్ణయించు వీలుగలదు వీరియందుజ్జ్వలమగుచున్న యుత్సాహమును కార్యరూపమున పరిణమంపజేసి లాభముగడించుటకు చక్కని యవకాశము లేర్పడవచ్చును. ఒక సామ్యవాదులే యననేల ఫ్యాసిస్టులుసహితము వీరిసాయమున తమయాటలు సాగించవచ్చును. ప్రతి యుద్యమమునకు వీరు చేదోడుగా నిలుచుచుందురనుట నిశ్చయము.

ప్రపంచమంతయు నేడు బాగుపడుచున్నదనియే వీరిదృఢవిశ్వాసము వీపద్ధతులననుసరించి యెటుల బాగుపడుచున్నదను విషయము వీరు కనుగొనుటకు బూనుకొనరు అదివీరికి గోచరము అభివృద్ధిమార్గముమాత్ర మవలంబించుచున్నదని విశ్వసించుచుండుటవలన తదనుకూల స్వప్నములే దిలకించుచుందురు. మొత్తముపై సామ్యవాదము, ఫ్యాసిజమునుండి వీరలకాపాడ నిజమగు దేశాభ్యుదయ మార్గమునవిప్పుట ప్రజాప్రభుత్వపక్షమువారి భారము.

ప్రేమపాశములకు నేటియువతీ యువకులు పూర్వులకన్న, తమ్ముసంఖ్యలో బంధితులగుచుందురు. ప్రేమవిషయములకన్న రాజకీయములు, ఆర్థికసమస్యలే వీరల పెక్కువగా నాకర్షించుచున్నవి ఆర్థికమాంద్యము నెట్టులైనను సరే పటాపంచలుజేయుటయే నాకర్తవ్యమనెడి దృఢనిశ్చయము వీరియందు నానాటికి వృద్ధిగాంచుచున్నది "దారిద్ర్యముగార్హస్థ్యము" నడిపెంచలి ప్రేమయనువాక్యములు దేశమునందు నేడు నాయునమ్మమాటలుగా పరిణమించినవి మునుముందేదని ఫలితము నిర్ణయించుటసంభవము కాలానుసార మీయుద్రేకము, ఉత్సాహము క్రమేణ తగ్గిన యువకబృంద మానాడు కూలవాడుట నిశ్చయమని వృద్ధులు వాపోవుచున్నారు

## ఆంధ్ర సోదరుల కొక సూచన

నేడు రాష్ట్రమందలి ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి తదేకదీక్షతో కృషిసలుపుచున్న ఆంధ్రమహాసభవలన జాతీయాభిమాన మడుగంటిన ఆంధ్రులలో "మేమాంధ్రులము, ఆంధ్రము మా మాతృభాష ఆంధ్రోన్నతికి హార్దపూర్వకముగా ఆత్మార్పణ మొనర్చుట మా విధ్యుక్తధర్మము. ఆంధ్ర యశశ్చంద్రికలతో దేశమును తేజోవంతమొనర్చుటయే మా జీవితపరమావధి"యను స్థిరసంకల్ప మేర్పడినది ఒక దశాబ్దమునకుపూర్వ మీ రాష్ట్రమందలి యాంధ్రులు ఆంధ్రులమని నలుగురిలో బాహాటముగా చెప్పుకొనుటకు సిగ్గుచేటుగా, ఆంధ్ర భాషలో మాటలాడు టవమానకరముగా భావించు గాఢవిభ్రమావస్థలో చిక్కియుండిరి ఇప్పుడు వారిలో జాత్యభిమానముతో చైతన్యము కలిగించిన ఆంధ్రజాతీయ సేవకులలో మాడపాటి హనుమంతరావు పంతులుగా రగ్రగణ్యులు. నిజముగా వీరు ఆంధ్రోద్యమ పితామహులు. వీరి నిరంతర సేవవలన దేశమునందు జాగ్రదవస్థ యేర్పడి ఆంధ్రులలో కార్యోత్సాహ మంకురించినది. ఆంధ్రావనియందలి ప్రతియణువునందీ మహనీయుని పవిత్రనామము ప్రతిబింబితమగుటయేగాక నవ యుగోదయ చిహ్నము లేర్పడుచున్నవి.

ఆంధ్రమహాసభ రాష్ట్రీయులలో ఆర్థిక నైతిక, వైజ్ఞానిక పునరుద్ధరణమునకు బూనుకొని ప్రయత్నించుచున్నది. దీనివలన జరుగుచున్న ప్రచారఫలితముగా గ్రామములందు జరుగుచున్న మహాసభ సమావేశములలో పాల్గొనువారిసంఖ్య పదివేలకన్న తక్కుగానుండకుండుట దేశమునం దేర్పడిన జాగ్రతావస్థను, కార్యాచరణసక్తిని విశదపరచుచున్నది

నేడు రాష్ట్రీయులలో మొలకలెత్తిన జాత్యాభిమానమును, దేశసేవాసక్తిని, ప్రజ్వలితమగుచున్న ధైర్యోత్సాహముల సఫలవంతమొనర్చుట ఆంధ్ర మహాసభవారి విధ్యుక్తధర్మమనవచ్చును. నానాటికి దేశమునం దేర్పడుచున్న నిరుద్యోగ బీభత్సమును నిర్మూలింపజేయుటకు రాష్ట్రీయ పరిశ్రమల ప్రోత్సాహమత్యవసరము విద్యాలయములందు బోధింపబడుచున్న విద్య భావిసౌఖ్యజీవనమునకంతగా లాభదాయకములు గాజాలవనుట నిశ్చయము. కావున రాష్ట్రీయులు ఆంధ్ర మహాసభతోపాటు నిజామాబాదయందు దేశీయ పరిశ్రమల ప్రదర్శనము జరిపిన దేశీయులలో పారిశ్రామికాసక్తి హెచ్చి దేశము సౌభాగ్యవంతమగుటకు వీలేర్పడును. కోటిమహాసభ అహ్వానసంఘమువారీ విషయ మాలోచించుటకు గోరుచున్నాము.

రాజగోపాలరావు బి. ఏ.

## ప్యాలస్టైన్‌లో అంతర్జాతీయ ప్రభుత్వస్థాపన

ప్యారిస్ ౨౫ అక్టోబరు

ఇటీవల సిన్యర్ మసోలినితో హెర్ బక్ట్రాపు రోమునగరమునందు కలిసి మాటలాడినసందర్భమున సార్ ప్రాంతముమాదిరి ప్యాలెస్టయినునందొక అంతర్జాతీయ ప్రభుత్వమేర్పరచు టత్యవసరమనియు, తమ దౌర్జన్యపద్ధతుల వలన రాష్ట్రసంఘమునకు అపజయము కలిగించవలదనియు, మాటలలో కాలహరణమొనర్చుట శ్రేష్ఠమనియు, జపానుకు వ్యతిరేకముగా నొకయొడంబడిక కలిగించుకొనుటావశ్యకమని మసోలినితో విశదపరచినటుల తెలియుచున్నది.

## స్పేన్ గృహ కల్లోలములు

రెండు ఇటలీ విమానములు పడగొట్టుట

వెలెనేష్యా ౨౫ అక్టోబరు

బార్సిలోనా సమీపమున ప్రభుత్వమువారి సమరవిమానములు యిటలీవారి రెండువిమానముల పడగొట్టినటుల ప్రభుత్వమువారిప్రకటన విశదపరచుచున్నది వీటిలో నొకటి సముద్రమునందు రెండవది పర్వతప్రాంతమునందు పడినవి విమానములందుండిన అయిదుగురు మరణించిరి వీరివద్ద లభించిన కాగితములవలన వీరు యిటలీవారని విశదమగుచున్నది.

## వైమానిక కేంద్రముపై బాంబులు

లండన్ ౨౫ అక్టోబరు

ఏర్పాప్రొకుకంపెనివారి వైమానిక కేంద్రముపై మేనోకాపైని విమానమొకటి బాంబుల కురిపించెను ఈవిమానముపై మెష్టిగన్నె ఉండెను. తిరుగుచున్న యొకయోధుపై ఆరే బాంబులు విసరబడినవి. ప్రాణనష్టము కలిగినటుల యింతవరకు వార్తలేవియు చేరలేదు.

## ఫ్రాంసువారి యోడ గతి

బ్రేస్ట్ ౨౫ అక్టోబరు

బార్సిలోనానుండి ౪౦ మైళ్ల దూరమున "కోయిమిలా"యను యోడపై బాంబులు విసరినందున యది సముద్రమునందు మునిగిపోయినటుల నావికశాఖవారు ప్రకటించిరి, వివరములుమాత్రము తెలియలేదు. నావికాధికారులు యోడను సమర యోడలవారికిచ్చియుండిరి.

## బెల్జియం ప్రభుత్వమందలి మంత్రివర్గపు రాజీనామా

బ్రసల్స్ ౨౫ అక్టోబరు

నేడు మధ్యాహ్నము జరిగిన కార్యకారిణీ సభయందు మంత్రివర్గమువారు రాజీనామా యొసగుటకు తీర్మానింపబడినవి.

## చీనావారి ప్రభావము

షాంఘాయి ౨౫ అక్టోబరు

ఒకరంగమునందు ౨వేలకన్న నెక్కువ జపాను సైనికులు మరణించినటుల, టాంషేన్, నానిసాన్ ప్రదేశములింకను చీనావారి ఆధీనమునందేయున్నటుల, దోవలన్నియు చెడగొట్టబడుటయు, చీనావారు వాన్ నదియొద్దన సోరంగములు కలిగించినటుల చీనా ప్రభుత్వమువారి ప్రకటనలు తెలుపుచున్నవి

## వరంగల్ జిల్లా

ఎస్.ఎం. లుఖ్మాన్ కంటివైద్యులు, సులోచన వ్యాపారులు (కంటి వైద్యులును, సులోచన వ్యాపారులును నగు హెచ్.ఎం.సుల్తానుకొమారుడు)యిప్పుడు వరంగలు తామీరాతు డాకు బంగ్లాలో నున్నారు. స్థానికవాసులు వీరితో సంప్రతించి తమ నేత్రవ్యాధులను గూర్చి సలహాపొందు అవకాశము గలదు. వీరిసమయమున సిద్ధమైయున్న సులోచనములనుయిచ్చునట్టియేర్పాటును గూడ చేసియున్నారు. అందరును తమ నేత్రపరీక్షలను జేయించుకొనవచ్చును.

(ప్రకటనకర్త: మేనేజరు- ఎన్.యం. లుఖ్మాన్ అండు సన్సు- రెసిడెన్సికోరి బస్సుస్టాండు హైదరాబాదు-దక్కన్.)

## జపానువారి గుండు వర్షము

లండన్ ౨౫ అక్టోబరు

టాంషాన్ అవశేషము నాక్రమించుకొనియున్న చీనావారిపై జపానువారు బాంబుల కురిపించుచున్నారు. కాని యింతవరకు జపానీయులు టాంషాన్ ప్రదేశమును ఆక్రమించుకొనుటకు బూనుకొనకుండినటుల తెలియుచున్నది.

## చిక్కు ప్రశ్నలు

(నందగిరి ఇందిరాదేవి బి. ఏ.)

సాధారణముగా ఇల్లస్ట్రేటెడు వీక్లీ, ఖైసరె హింద్, మొదలగు వారపత్రికలందు "మైనాగజీను" మొదలగు మాస పత్రికలందు ప్రతి పక్షమున ఇచ్చే చిక్కు ప్రశ్నలకు సమాధానములు సరిగా వ్రాసినవారికి ఇరువది వేలు, ఏబది వేలు బహుమానమని ప్రకటింపబడియుండును. ఆ పత్రికల అనుకరణముతో తెనుగు పత్రికలందుగూడ అటువంటి చిక్కు ప్రశ్నలు వచ్చుచున్నవి. ఈ పద్ధతి చిక్కు ప్రశ్నల మూలకముగా గాలకపోయినను ఏదో రూపమున దేశమంతటను వ్యాపించిపోయి పిన్న పెద్దల నమితముగా ఆకర్షించుచున్నది.

ఈ చిక్కు ప్రశ్నలకు భారతదేశములో ప్రతినెలకు ప్రజలు సమాధానములు వ్రాసి దానితో పత్రికల యజమానులకు పంపు ప్రవేశ రుసుము ఇరువదిలక్షలవరకని అంచనా వేయబడినది. పోటీదారులకొరకు ప్రతిఫలముగా పత్రికాధిపతులు అయిదు లక్షలకంటె ఎక్కువ ఖర్చుపెట్టుటలేదు. కొన్నిసార్లు చాల పెద్ద మొత్తము బహుమానముగా ప్రకటింప బడినప్పటికిని పోటీదారులు చాల కొద్ది పైకముతోనే తృప్తి పొందవలెనని వచ్చుచున్నది. జన సామాన్యము ఇట్టి పైజుమువలన లాభమునందు ఉద్దేశముతో తిరునాలలోను, ఉత్సవములలోను, పలు విధములగు వ్యాపారము జరుగును. మన హైదరాబాదునందుగూడ అప్పుడప్పుడు వచ్చుచుండు "ఫైటుపిటీ" వంటి ప్రదర్శనములలో అనేకరకములగు జూదము లెన్నియో గలవు కాని జనసామాన్యము అమాయకత్వమునుండి ఈ విధముగా ధనము దోచుకొనుట అన్యాయమనియే ఇండియన్ శిక్షాస్మృతి చట్టము ౨౯౪ సెక్షను నిర్మింపబడినది. కాని ప్రస్తుతము పత్రికలలో ప్రకటింపబడు పైవర్ణింపబడిన చిక్కు ప్రశ్నలు ఈ చట్టము క్రింద ఏల నిషేధింపబడగూడదు?

ఇదికూడ ఒకవిధమైన పందెముగా పరిగణింపవచ్చును. హిందూదేశములో దీనికొరకు ఇరువదిలక్షలరూపాయలు వ్యయమగుచున్నప్పుడు ఇది శిక్షాస్మృతిచట్టము ౨౯౪ సెక్షను ప్రకారము శిక్షింపబడు జూదము లాటరీ, మొదలైన నేరములలో చేర్చుట కేలాటి అభ్యంతరముండకూడదు. ఇంగ్లాండులో ఇటువంటివి నిషేధింపబడి బెటింగు లాటరీశాసనము ౧౯౩౪ క్రింద శిక్షించబడుచున్నవి.

ఇంగ్లండు అపీలుకోర్టులో ౧౯౩౬ లోని ఇటీవలి కేసులలో పద్ధతి లాటరీ అవునా కాదా యని విచారించబడినది. లాటరీఅను శబ్దము ఉపయోగించ వ్రాయబడియున్న దీని అని కోర్టువారు నిస్సంకోచముగా నుడివిరి. లార్డుహీవర్టు ఇండియాలో ఇప్పుడు జరుగుచున్న పోటీలు మొదలయినవి లాటరీలుకావు అనేకేదాభిప్రాయమున కవకాశము లేకుండా చెప్పిరి. ఈ పోటీలలో అదృష్టమును పరీక్షించుటయేగాని మనిషి నేర్పును చూచునవికావు గావున ఇది లాటరీ యనియే నిశ్చయింపబడినది(?)

పోటీదారు ప్రవేశరుసుము క్రింద కట్టినడబ్బు ఒకవేళ అతనికి బహుమానము లభించకపోయిన న్యాయస్థానమువారు అతనికి మరల పైకము యిప్పించగలరాయన్న ప్రశ్న చాల విచిత్రమైనది. లోతుగా ఆలోచించినట్లయిన ఈ పైకము వచ్చితీరవలసినదే. ఉద్యమకారకుడు తనదగ్గర ఇదివరకే తయారుచేయబడిన సమాధానముతో ఏకీభవించే సమాధానము వ్రాసినవారికి ఇరువది వేలు బహుమాన మిచ్చెదనని ప్రకటించును. పోటీదారు దానికి ఒప్పుకొన్నట్లు విదర్భనముగా కొంత పైకము సమాధానముతోగూడ పంపును. ఈ ఒడంబడికయొక్క ఉద్దేశము న్యాయవిరుద్ధమైనది. ఉద్దేశము న్యాయవిరుద్ధమగుటవలన ఈ ఒడంబడిక కాంట్రాక్టుశాసనము క్రింద నిష్ప్రయోజనము. అట్లు నిష్ప్రయోజనమని కొట్టివేయబడిన అన్ని ఒడంబడికలలోను ఒడంబడికవలన లాభముపొందినవారు ఇంకొకనికి ఒడంబడికచట్టము క్రింద తిరిగి అలాభమును ఇచ్చివేయుటయో లేక మరియొక విధముగా చేర్చుటయో ఆవశ్యకరము. ఈ దృష్టి ప్రకారము ఉద్యమకారకుడు తాను తీసికొనిన ప్రవేశరుసుము తిరిగి ఇచ్చివేయవలయును. ఇటీవల చాల కేసులలో ఈవిధముగా ఉద్యమకారకుని నుండి పోటీదారు డబ్బును తిరిగి పొందుటకు హక్కు కలదని తీర్మానింపబడినది.

ఇటువంటి జూదములను గురించియు ఉద్యమ కారకులను గురించియు ఇటీవలనే మద్రాసు ఉన్నత న్యాయస్థానమునందు విపులముగా చర్చించబడినది. బహుమతులు పంచిపెట్టబడినతరువాతగూడ పోటీదారు తన ప్రవేశ రుసుమును తిరిగిపొందుటకు ఎట్టి ఆటంకము లుండజాలవనియు అట్టిది న్యాయసమ్మత మనియు పై కేసునందు న్యాయమూర్తులు తీర్మానించినారు. కావున ఈ తీర్పు ప్రకారము పోటీదారులందరికి తాము పంపిన ప్రవేశ రుసుము తిరిగి పొందుటకు అర్హత కలదు.

మనదేశములో లాటరీ రూపమువనున్న ఈ పోటీలను తీసివేయుటకును నిషేధించుటకును చక్కని నూతన శాసనము అమలులో నుంచుటకు ప్రయత్నములు జరుగవలయును. ఇవి ఇంగ్లండులో ౧౯౩౪ బెటింగు శాసనమువలన నిషేధింపబడినవి. అమెరికాలో కూడ వీనిని అంగీకరించుటలేదు. కనుక మన ప్రభుత్వమువారు బెటింగుశాసనము వలెనే ఇక్కడ కూడ ఒకశాసనమును ప్రవేశ పెట్టగలరని ఆశించుచున్నాను.

---




## "వ్యవసాయకులు గమనించదగు ముఖ్యాంశములు"

వాడపల్లి మురహరిరావు

ప్రతి కృషీకలుడు దిన, సంవత్సర లెఖలు వ్రాసితీరవలెను సంవత్సరము అనంతరము లాభనష్టములు తేల్చవలెను కూలిఖర్చులు ఎన్ని? ఏవిధమైనవి? కూలిరేటు ఎంత? ఎటువంటి పనిని చేసినారు - అని చర్చించవలెను. ఎక్కువరేటు యిచ్చినను ఎక్కువవిలువ కలపనిని చూపునట్లు చేయవలెను యింటివారు యెంతమంది పనిలో పనిచేసినారు కూలిపనిని బాగుచేయవలెను. మంచిమానేజిమెంటు ఉంచవలెను. ఎరువులకు ఎంతఖర్చు అయినది వ్రాయవలెను స్వంతపశువుల ఎరవు అయినను లెఖకట్టవలసినదే ఎన్ని సం॥ ఆ ఎరువులాభము, ఏరూపమున ఉన్నది గమనించవలెను అన్నియు జాగరూకతతో గమనించవలెను

ఆసామి ప్రతినిత్యము తనపొలము తోటచుట్టును తిరుగుటలేక పనిచేయుట గొప్పయెరువు. తాను స్వయముగా తనపనులచూచుట, పాల్గొనిచేయుట చాల ఎక్కువ శ్రేష్టతరము

సకాలమున పనులు చేయవలెను చేతిలోవిత్తు చేలోవిత్తుకన్న లేత పుడు ధర్మమును గమనించవలెను.

ఎండాకాలములోనే పనులు పూర్తిచేసి భూమినీ కలుపులేక గుంటకకొట్టి తొలివానలకే సిద్ధముగా వుండవలెను ౧౦౦ గ పశుగ ఎరువానివలె నుండవలెను

ఎద్దుఏడ్చిన వ్యవసాయము, ఆలుఏడ్చినయిల్లు వృద్ధికి రానేరదు కావున ఎద్దును బాగుగా మేపి ప్రేమతో చూచి తగినపనిని చేయించవలెను

ఇంటిలో ఆరోగులు పెద్దలుపిల్లలు చేతనైనంతపనులుచేసి తోడ్పడవలెను రాటము పనిచేసి కొంతపాదుపును వృద్ధిచేయవలెను తాళ్లు పేయుట, చాపలుఅల్లుట వగయిరాలు చేయవలెను

పాడితో పంటనోపడు పాడి పశువులను బాగుగా పోషించవలెను. ఇంటిఖర్చు జాగ్రత్తగా తగ్గించవలెను లెఖలువ్రాసి తీరవలెను ఇంటికి కూరలు కాయించితీరవలెను పూలను పండ్లను, కూరలు కావలసినంతవరకైనను వుత్పత్తి చేసితీరవలెను—కూరలు బాగుగా పండించి భుజించుట ఆహార ఆరోగ్యరహస్యము ౩ నెలలకువచ్చి ఆకు కూరలు తీగెకాయలు, ౬ నెలలకువచ్చు చిక్కుళ్లు, ౮ నెలలకువచ్చు కూర పండ్లు అనేకములుకలవు (దోస, బీర్లు, తోటకూర, సొర, గుమ్మడి, టమాటా)

## ఎరువు గుంతలు

గ్రామములందే సందు గొందులు చూచినను పెండ, చెత్త, మురికిన, కుళ్లినవస్తువులు తరుచుగా పడి యుండుచుండును. ఈ మురికియందు కొన్ని గాలికి ఎగురును, మరికొన్ని వర్షమువలన కొట్టుకొనిపోవును, మరికొన్ని పశువుల త్రొక్కుటవలన చిందరవందరమై పడియుండును గాలిలో నెగురు వస్తువు శరీరముపై ప్రసరించుటవలన చర్మరోగములకు మూల కారణమగుటయేగాక నోటిద్వారా ఆవస్తువుల సారము కడుపులోనికి పోవుటవలన అనేక రోగములు కల్గు మనుటకు వీలుకలుగుచుండును కండ్లలోనికి ప్రసరించి కంటిరోగము లేర్పడును ఈ చెత్త చదారములు, పెంటకుప్పలు కప్పి వుచ్చకుండిన మనుష్యులకేగాక పశువులకు సహిత మనేకవిధములగు వ్యాధులు సంభవించితీరును. ఈకసువు చెత్త, పెంట వర్షమువలన చెరువు, కుంటలలో కిపోరిన, అనీరు పశువులు త్రాగిన, స్నానమాడిన వాటి కనేకవిధములగు రోగములు కలుగుచుండుట యించుమించుగా ప్రతి వ్యవసాయకునికి తెలిసియేయుండును

ఈముప్పుకు ముఖ్యకారణము గ్రామవాసులు మురికిని, పెంటను, పెండను కప్పి వుచ్చకుండుటయే. వ్యవసాయమున కదియెంత బాధదాయకములో గమనించకుండుటయే యనవచ్చును. కసువుల చిమ్మకుండుటయే రోగోత్పత్తికి, వాని ప్రాబల్యమునకు ముఖ్య హేతువనవచ్చును ఈపెంటకుప్పలు "వ్యవసాయమున కమూల్యములు, గ్రామవాసుల కపాయకరములు." వీటిని చక్కని పద్ధతులపై కాపాడిన అవి మనకు లాభము చేకూర్చును, కాపాడిన కసువు దుర్గంధము వాయువునందు ప్రసరించకుండుటచే గ్రామవాసుల ఆరోగ్యము సురక్షితముగానుండును ఈపద్ధతివలన రెండు లాభములు ముఖ్యముగా చేకూరును పంటకుచక్కని యెరువుగా నుపయోగపడుట నొకటి, మనుష్యులకు, పశువులకు వ్యాధులు కలుగకుండుట రెండవదిగాగలవు వేయేల యిట్టి కసువును, పెంటలను గుంతలలో కప్పిపుచ్చియుంచిన లాభదాయకమేగాని నష్టకారణము కొజాలదు

(౧) దీనివలన గ్రామములందు ప్రబలు రోగములలో ముప్పాతిభాగ మంతరించును

(౨) గుంతలలో వివి కప్పిపుచ్చిన యీ యెరువు పరిమాణము వృద్ధియగుటయేగాక బలము హెచ్చుటవలన పంటల కధికలాభము చేకూరును గ్రామమంతటి సందులలో, చుట్టుపట్టుల పడియుండుకసువును చిమ్మి గ్రామమునకు సమీపమున, లేక యిండ్లకు కొద్దిగా దూరమున గోతులుత్రొవ్వి కప్పిపుచ్చి యుంచవలయును

ఈగోతులు ౨ గజముల వెడల్పు, ౨ గజములలోతున, అవసరమున్నంత నిడుపునిగా త్రవ్వవలయును గోతుకొకవేపు యేటవాలుగా జేసిన కసువంతయు జారియందు చేర్చి అదినిండిన దానిని కప్పివేయవలయును గోతిపైకొన్ని అంగుళముల మట్టిమాత్రమే చేర్చవలయును రెండవగోతి యిటుల నింపబడువరకు మొదటి దానియందు ఫులియుట నించుమించు పూర్తియగుటవలన అది మట్టిగామారి, దానియందేలాటి దుర్గంధముండకుండును విషవాయులు పృథక్కరణమైతీరును, దానియందు బలము హెచ్చును దీనివలన యవి ఫలదాయకమగు యెరువుగా మారుటవలన యే పొలమునందు చేర్చినను పంటలు చక్కగా, ఫలవంతమగుట నిశ్చయము

ప్ర॥ గ్రామమునందేల గోతులుత్రవ్వి కసువు కప్పియుంచవలయునో దీనివలన గ్రహింపబడును ఈపద్ధతిచే గ్రామమందలి ప్రజల, పశువుల ఆరోగ్యము సురక్షితముగా నుండుటయేగాక ప్రజలకు వ్యవసాయమువలన యైశ్వర్యము చేకూరును దీని కంతటికి ధైర్యము, కృషి అత్యవసరము తమకుతాము సాయపడువారికే దైవము సాయపడును.

—పంజాబు గ్రామోద్ధరణ సంఘము.

తనభూమినితక్కువగని లెఖకుమించిన ఖర్చులుచేసి చెడిపోయినపెద్ద భూఖామందులు చాలమందికలరు పెద్దభూఖామందులు సంసారఖర్చుఎంత, వ్యవసాయఖర్చు ఎంత అని విడదీసి వ్రాయవలెను సంసారఖర్చులు, రైలు, మోటారు కోర్టు వ్యవహారఖర్చులకు, పాడలకు భూమియియ్యజాలదు నీ అకులన్నము, బట్ట, సంతోషమయిచ్చును పనివియిచ్చును కృతజ్ఞతతో పనులుచేయవలెను నేను పెద్ద భూఖామందునని విర్రవిగి అప్పుచేసి చెడినవారిసంఖ్య పెరిగిపోవుచున్నది చక్కని లెఖలు వ్రాసినిడతీసిచూచిన నష్టము ఎక్కడో ఎట్లు అనష్టమును ఆపవచ్చునో తెలుసును

పెళ్లిళ్లకు ఇతరకార్యములకు తనకు మించిన ఖర్చులుచేసి డబ్బు అప్పులుతెచ్చి వడ్డీలకుఅయి వేలాచాలక బాకీలుపెంచి నశించిన కుటుంబములుకలవు

కుటుంబములు పెరిగినకొలది అందరును ఎక్కువ పనివారు కావలెను ఎక్కువపంట విలువగలపంట తక్కువ ఖర్చుతో చేసినగాని యితరమార్గములు లేవు

భూములను బాగుగాపండించునట్లు మార్చవలెను నీరులేనికావులలో సిటివసతులు కల్పించుధర్మము గవర్నమెంటువారిదే శ్రీ శ్రీ నైజాంవారు అట్లే చేయుచున్నారుగదా. పన్నులుతగ్గించి తక్కువ ఖరీదుతో అనీరు అందచేయవలెను.

బావులు వీలైనచోట్ల త్రవ్వి తోటలువేయుట ఎక్కువ దగ్గరమార్గము.

అబావులకు అయినఖర్చు తక్కువ వడ్డీతో సర్కారువారే దీర్ఘ వాయిదాలతో పైకముయియ్యవలెను "కృషీకలులకు మేలు కలుగుగాక"

## కాలమాన నివేదిక

౯ అజూరుతో అంతమగు వారమునందు రాష్ట్రములో కాలమాన మిటులుండెను — వరంగలు, నల్లగొండ, రాయచూరు, మహబూబునగరము జిల్లాలలో కొద్దిగా వర్షము, గుల్బర్గా జిల్లాలో తుంపిరవర్షము కురిసినది ఇతర జిల్లాలలో వర్షమే లేకుండెను రాష్ట్రమునందు దామాషాగా ౦౦౩ అంగుళముల వర్షముకురిసినది ఈ తేదివరకు వర్షము బీదరు, ఔరంగాబాదు, రాయచూరు జిల్లాలలో తప్ప రాష్ట్రమునందు పరిమాణముకన్న తప్పుగా గలదు, తేమి చాలాయుండెను. దామాషాగా నిజామాబాదులో ౯౭ డిగ్రీలు, హైద్రాబాద నగరమునందు ౬౬ డిగ్రీల వేడిమి యేర్పడియుండెను

### పంటలు పైరులు

చెరుకు చక్కగాగలదు పుగాకకోతలు జరుగుచున్నవి కొన్నిస్థలములందు ప్రత్తి చేర ఒమతున్నది అది వరిపైరులు కోయబడుచున్నవి వరంగలు, కరీంనగరము, నిజామాబాదులో కొన్ని ప్రాంతములందు వరిపైరుకు నీరు ఆవసరము చాలాగలదు. రబ్బీ విత్తబడుచున్నది

### నీరు. మేత

నీటి సౌకర్యము చక్కగాగలదు మహబూబునగరము, నల్లగొండ, గుల్బర్గా జిల్లాలలో మేత కరువుయింకను గలదు పశువ్యాధి తగ్గుచున్నది వరంగలు, కరీంనగరం, ఆదిలాబాదు, మెదకు, బీదరు, పర్భణిజిల్లాలలో పశువ్యాధికనుగలదు

### ధాన్యము. ధరలు

| ధాన్యము | రూపాయికి |
|---|---|
| గోధుమలు | ౬-౧౦ శేరులు |
| బియ్యము | ౩ ,, |
| జొన్నలు | ౧౩॥ ,, |

### వర్ష వివరములు

| | | |
|---|---|---|
| హైద్రాబాద నగరంలో | ౦ ౨౩ | అంగుళములు |
| ఆత్రాపుబల్దా | ౦ ౬౩ | ,, |
| వరంగలు | ౦ ౩౩ | ,, |
| కరీంనగరం | ౦ ౦౩ | ,, |
| ఆదిలాబాదు | | ,, |
| మెదకు | ౦ ౦౨ | ,, |
| నిజామాబాదు | | |
| బాగాతు | | |
| మహబూబునగరం | ౦ ౩౯ | ,, |
| నలగొండ | ౦ ౭౩ | ,, |
| ఔరంగాబాదు | | |
| బీడు | | |
| నాందేడు | | |
| పర్భణి | | |
| గుల్బర్గా | ౦ ౪౭ | ,, |
| ఉస్మానాబాదు | | |
| రాయచూరు | ౧ ౨౪ | ,, |
| బీదరు | | |
| రాష్ట్రములో దామాషా | ౦ ౩౦ | ,, |

---

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 12 | HYDERABAD-DECCAN | Number 48

Thursday 28th October 1937



## అభివృద్ధి గాంచిన ఆంధ్ర జాతి

### భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమునకు బలమొసగినది ఆంధ్రులు

### అఖిలాంధ్రమహాసభ సమావేశము

### శ్రీ చల్లపల్లి రాజాగారి గంభీరోపన్యాసము

(గోలకొండ ప్రత్యేక ప్రతినిధి)

బెజవాడ, అక్టోబరు ౨౫

ఆంధ్రదేశమునందలి వివిధప్రాంతములనుండి వచ్చిన ప్రేక్షకులతోను, ప్రతినిధులతోను, నేడు సాయంత్రము ౩ గంటలకు ఆంధ్రమహాసభ సమావేశమయ్యెను. సభయందు న్యాయపతి సుబ్బారావు గద్దె రంగయ్యనాయుడు, డాక్టరు పట్టాభిసీతారామయ్య, దండు నారాయణరాజు అలీబేగు, పుల్లెల శ్యామసుందరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, చల్లా జగన్నాథంగారలును, ఇతరులును పాల్గొనియుండిరి.

బ్రాహ్మణోత్తములు వేదమంత్రములతో సమావేశము ప్రారంభమైనది. గుంటూరు శారదా నికేతనము విద్యార్థినులు ఆంధ్రమాత ప్రార్థనము గావించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ చల్లపల్లి రాజాగారు ప్రతినిధులకు స్వాగతమొసగుచు సమావేశప్రాముఖ్యతను వివరించిరి. ఆంధ్రుల ప్రాచీనప్రతిష్ఠను, ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రాముఖ్యతను వివరించుచు రాజాగారిట్లనుడిరి:-

మిది ఆంధ్రరాష్ట్ర నిర్మాణాందోళనకు అవసరధనము చేకూర్పవలెను."

శ్రీ రాజాగారు తమయుపన్యాసమును విరమించుచు "మనమందరమును ఒకేజాతికి చెందినవారమని మరువకుడు మన అభివృద్ధి మన ప్రత్యేక రాష్ట్రనిర్మాణముపై ఆధారపడియుండునని విశ్వసించుడు. ఉత్తరసర్కారులలోని ఆంధ్రులును మీరును ఏకమై కార్యసిద్ధికి కంకణము గట్టుకొనుడు" అని రాయలసీమ వాసులను సంబోధించిరి.

తరువాత మహాసభాధ్యక్షులగు శ్రీ కోటిరెడ్డి గారు అధ్యక్షపీఠమును స్వీకరించి శ్రీ హెచ్ సీతారామరెడ్డిగారిని మహాసభా ప్రారంభమును

మహాసభాధ్యక్షులగు శ్రీ కోటిరెడ్డిగారుపన్యసించుచు "ఈ మహాసభయందు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకే ప్రాముఖ్యత యొసగవలయునని నాఅభిప్రాయము రాష్ట్రసంపాదనకై దృఢసంకల్పము గావించుకొని కార్యవిధానమును నిర్ణయించుకొనవలెను ప్రత్యేకరాష్ట్రమేర్పడిన రాజకీయముగను, సాంఘికముగను, ఇతర విధములను ఆంధ్రులకు గొప్పలాభము సిద్ధించును" అని నుడివిరి.

వీరు ప్రస్తుత రాష్ట్రీయ స్వపరిపాలనను గూర్చి ప్రస్తావించుచు "నూతన సంస్కరణములననుసరించి రాష్ట్రములకు కొంత స్వాతంత్ర్య

గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు

ము ప్రసాదింపబడినది బాధ్యతాయుత ప్రభుత్వము వృద్ధిచెందవలయుననిన సామాన్యప్రజాపరిపాలనా విషయములందు శ్రద్ధవహించుచు శాసనసభలయందు తమ ప్రతినిధులు చేయుచున్న పనులను గమనించుచు ప్రభుత్వవిధానమును

గద్దె రంగయ్యనాయుడుగారు

"ఈనాడుగూడా ఆంధ్రజాతిఅన్ని ఉద్యమములలోను ముందంజ వేయుచున్నది సాహిత్యమున, చిత్రకళలో, గానమున, విజ్ఞానమున ఆంధ్రజాతి పొందినయభివృద్ధి గర్వింపదగియున్నది జాతీయోద్యమములో నడుముకట్టి యితరజాతులకంటె ముందునిలబడినది ఆంధ్రజాతి, భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమునకు బలమొసగినది ఆంధ్రులు

ప్రయోజనమేమి? ఇతరులకు మార్గదర్శకులై తాము వెనుకబడినగౌరవముకూడా ఆంధ్రులే పొందినారు. ఆందోళనలో లోపములేదు ఆర్భాటము పూర్తిగానున్నది. ఇరువదైదుసంవత్సరములనుండియు మహాసభలు, ప్రత్యేకసభలు జరుగుచునేయున్నవి. మన నాయకులు, మన పత్రికలు ఈసమస్యనుగూర్చి ప్రాముఖ్యత నొసగుచునేయున్నారు. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతనుగురించి తీవ్రముగ ప్రచారము చేసినసోదరులే అధికారస్వీకారముతో అభిప్రాయములమార్చుకొని వ్యతిరేక ప్రసంగములు చేయసాగిరి. దాదాపు డెబ్బదైదువేల చదరపుమైళ్ల విస్తీర్ణముగలిగి, రెండున్నరకోట్ల జనసంఖ్యతో, సుమారు ఏడుకోట్ల ఆదాయముకల్గు తెలుగుజిల్లాలు ప్రత్యేకముగాఏర్పడిన, ఉత్కళరాష్ట్రమునకు తీసిపోవునా?

కార్యసిద్ధికి కంకణము కట్టవలసిన తరుణమిది, సభ్యులతో పనిచేయవలసిన సమయ

న్యాయపతి సుబ్బారావుగారు

సలుపుటకై కోరిరి శ్రీ సీతారామరెడ్డిగారు సభ ప్రారంభించుచు "ఆంధ్రులు దేశములోవిప్రాంతమునకున్నను వారొందరులను గాఢముగా ప్రేమింతురు. ఆంధ్రరాష్ట్రోద్యమములో చేరి మనస్ఫూర్తిగా దానిని బలపరచుటకు వెనుదీయు

పట్టాభి సీతారామయ్యగారు

దక్షిణమండలాంధ్రులలో కొందరి మనస్సులను త్రిప్పుకొరకుగూర్చి మీరందరాలోచింపవలయునని కోరుచున్నాను మహాసభ తీర్మానములు భారతదేశములోనుండు ఆంధ్రులందరిని ఏకము చేయుటకు అనుగుణ్యముగా నుండవలెనని సూచించుచున్నాను." అని తెలిపిరి.

కొంతవరకు నిర్ణయింపవలసియుండును ప్రజల ఆశయములకు, అభిప్రాయములకు అనుగుణ్యముగా పరిపాలన జరుగవలెననిన, ప్రభుత్వవిషయములందు ప్రజలెక్కువ శ్రద్ధవహింపవలెననిన శాసనసభలలో చర్చలు మాతృభాషలోనే జరుగవలెను భాషాప్రయుక్త రాష్ట్రములేర్పడినగాని ఈవిధముగ సామాన్యప్రజలు గ్రహింపగల భాషలో శాసనసభాచర్చలు జరుపుటకవకాశముండదు అందరును హిందీనేర్చిన ఈచిక్కులుతీరునని కొందరి యభిప్రాయమైయున్నది కాని మాతృభాషను చంపుకొనుట కెవరును అంగీకరింపజాలరు సామాన్యప్రజలకు హిందీ అనవసరము అని తెలిపిరి

శ్రీ రెడ్డిగారు కాంగ్రెసుమంత్రులు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునెడ గనబరచుచున్న విముఖత కాంగ్రెసు సిద్ధాంతములకు వ్యతిరేకమని స్థిరీకరించుచు ప్రత్యేక రాష్ట్రనిర్మాణమవసరమని ప్రకటించిరి

అధ్యక్షులు తమఉపన్యాసమును ముగించుచు ఇట్లనుడివిరి —

ఆంధ్రరాష్ట్రము లేనందువలనప్రజలెన్నియో చిక్కులను, బాధలను అనుభవించుచున్నారు ప్రత్యేకరాష్ట్రమేర్పడిన రాష్ట్రాభివృద్ధికై కృషి సలుపుటకు, ఆంధ్రదేశములో నిరుద్యోగసమస్య నివారించుటకు వీలగును ఆంధ్రుల వ్యక్తిత్వము సారస్వత కళలు సమగ్రముగా వృద్ధిగాంచవలెనన్న ప్రత్యేకరాష్ట్ర మవసరము

## ప్రపంచ క్లిష్టపరిస్థితులకు కారణం

### సామ్రాజ్యకాంక్షయే యుద్ధం ఉద్భవింపజేస్తుంది

యుద్ధం అంతమొందించడానికి యుద్ధం అనే సాంప్రదాయం మారి సంధిని విచ్ఛిన్నం చేయడానికిసంధి అగత్యం అనేరోజులువచ్చినవి ౧౯౧౮ సంవత్సరంనాటి ప్రపంచయుద్ధానంతరం ప్రజ్వరిల్లిన రెండుమహాశక్తుల విజృంభణమే నేటిక్లిష్టపరిస్థితులకు మూలం వర్తమానకాలంలో యూరపురాజ్యాలలో చెలరేగిన సామ్రాజ్యకాంక్షకూ, సామ్రాజ్యవ్యాపనమునకూ బీజములు మొలకెత్తినవి అప్పుడే అప్పటి యుద్ధానంతరమే, యూరపు రాజ్యాలలోనూ, పరాధీనంగానున్న భారతదేశంలోనూ ప్రాచ్యయంలోనూ, ఆర్థిక పునర్నిర్మాణంలోనూ, రాజకీయ వాతావరణంలోనూ, నవోదయమైనది. తత్రాపి ప్రతిదేశము, ప్రతిజాతి స్వీయాభివృద్ధికోసం కృషిసలుపుతూ యున్నది స్వాతంత్రేచ్ఛ, స్వజాత్యభిమానము దినదినము వృద్ధియై విశ్వవ్యాప్తి పొందినది.

ప్రస్తుతం రాజకీయప్రపంచాన్ని కలత పెట్టుతూ, మళ్లీ ఒకగొప్ప ప్రపంచయుద్ధం నూతన నిర్మాణానికి అవసరం అని విశ్వసింపచేసే మహావ్యక్తులు యిద్దరే ప్రపంచయుద్ధం, లేక ప్రపంచశాంతి వీరిద్దరికి బొమముడిపాటులలోనే యున్నది ప్రపంచ రాజకీయచరిత్రలో యింతవరకూ కనివినియెరుగని నూతనశక్తి, ప్రజ్ఞ ప్రపంచ పరిస్థితులను సుద్రూతటూచుచున్న ప్రజ్ఞాశాలురు వీరిద్దరే హిట్లర్, ముస్సోలినీల భావికర్తవ్య నిర్ణయంకోసం, ప్రాక్పశ్చిమదేశాలు రెప్పవాల్చక దీక్షతో గమనిస్తూ యున్నవి

ప్రపంచయుద్ధ పరిణామంగా ఉద్భవించిన వర్సేల్సు సంధిసరత్తు ఒక్కమారుగా తెంచివేయబడినవి అంతర్జాతీయ రాజకీయదక్షత, దూరదృష్టిగల రాజనీతి యెరుగని విల్సన్ మహాశయుని ౧౪ సూత్రాలు ప్రపంచరాజకీయ చరిత్రలో ఆదర్శ మహాన్యానికి ఉజ్వల నిదర్శనాలుగా నిలచియున్నవి ఆ జస్టిసు లేనిలోపము, సంధిషరతులలోని ప్రతియక్షరములోను ప్రతిబింబించినది ప్రపంచ యుద్ధానంతరం ఉద్భవించిన రెండు మహాశక్తుల తీవ్రప్రతీకార విజృంభణమే యిప్పుడు ప్రపంచాన్నంతటినీ కలతపెట్టుతూ యున్నది యూరపుఖండాలలో స్వాతంత్ర్యాభిలాష, రాజ్యవిస్తరణాజిజ్ఞాస సర్వత్ర ప్రబలిపోయినవి అపరిమితనిధి నిక్షేపములలో నొప్పినజర్మనీ, శాస్త్రీయ వైద్య పరిజ్ఞానంలో ప్రపంచాదర్శమైన జర్మనీ, రమారమి ౬౫ లేక ౭౦ మిలియనుల జనసంఖ్య కలిగిన జర్మనీ, వర్సేల్సు సంధిఫలితంగా ఆశయములు కోల్పోయి, స్వీయాభివృద్ధి తలపులు మరచిపోవలసి వచ్చినది ౭౦ మిలియనుల జనసంఖ్యకలిగిన జర్మనీ స్వయరక్షణార్థము నౌకాదళముగాని, సైనికదళముగాని, విమానాశ్రయములుగాని, నిర్మించుకోకూడదని కట్టడిగిలిగినది యుద్ధసమయమునకంటె, యుద్ధానంతరమే ప్రజలు అధికతరక్లేశమును పొందినారు అప్పటి వ్యాపారమాంద్యము, ఆర్థికమైన్యము, రాజకీయ పరాధీనము, దుర్భరమైనది పొందిన పరాభవానికి ప్రజలల్లో సానుభూతిచూపి, స్వీయాభివృద్ధికి రాజకీయంగాను, సాంఘికంగాను, ఆర్థికంగాను, నిర్మాణ కార్యక్రమాన్ని సూచించి ఆచరణలోపెట్టగల యుద్ధఫలితంగా ప్రజల్లోనెలకొన్న ఆత్మవిస్మృతిని పోగొట్టి పూర్వప్రజ్ఞను జ్ఞప్తికితెచ్చి, రాజకీయంగానూ, ఉన్నతికి సాధించడానికి కంకణము గట్టుకొనినవాడు హిట్లరు. నేడు జర్మనీప్రపంచ భాగ్యాన్ని శాసిస్తూయున్న నియంత హిట్లరు పుట్టుకచేత ధనికసంఘానికి చెందినవాడుకాదు

వక్తకాడు భాషాకోవిదుడుకాదు తాను విశ్వసించిన సిద్ధాంతాన్ని ఆచరణలోపెట్టి ప్రజలను తన కంటిచూపులలో నడిపించగల ప్రజ్ఞాశాలి ఆతనివిగ్రహములలో, ఆతనివాక్కులలో, ఆతని చూపులలో, ఆకర్షణయున్నది-ఆజ్ఞయున్నది అందుచేతనే యెనలేని ధైర్యంతో వర్సేల్సు సంధిషరతులన్నిటినీ ఒకదానివెంట నొకటి యుల్లంఘించి ప్రసిద్ధనౌకాదళము, జలాంతర్గాములు, భూయిజన్లు, విషవాయువులు, విమానసైనికదళములు, నిర్మించినాడు జర్మనీదేశీయుల ఆర్థిక వాణిజ్యాభివృద్ధి కనువైన నాకాశ్రయములు, ప్రపంచమార్కెట్లు, నెలకొల్పినాడు జర్మనీ నేడు స్వీయపరిజ్ఞానంతో ప్రపంచాన్ని ధిక్కరిస్తూంది జర్మనీ కంటియెఱుపు యితరదేశాల గుండెదడకు కారణమైనది.

ఇటలీ, జర్మనీదేశాల ప్రపంచయుద్ధంలో రాయబార కర్తృతయనువుకు చెందినవి (౧౯౧౮వ సంవత్సరంలో ప్రపంచయుద్ధ పర్యవసానంగా యుద్ధాక్రాంత మాగముల పంపిణిజరిగినది ఇటలీదేశపు ప్రతినిధి ఆర్లాండో కూడ యున్నాడు అసలు పంపిణిమాత్రం యితడి పరోక్షంలోనే జరిగింది యుద్ధానంతర సంధిఫలితంగా యెవ్వరూ రాజ్యాక్రమణకు పూనుకోకూడదని లాయర్ జార్జిప్రభువు గంభీరోపన్యాసం యిచ్చాడు ఉపన్యాసానంతరం కొద్దికాలంలోనే ఇంగ్లాండు ఆర్థిక ఆక్రమణ సాగించినది యుద్ధములో గెలుచుకొన్న దేశముల పంపిణీకి సంతోషించి స్వదేశాభిముఖుడైవాడు ఆర్లాండో ఆతడు స్వదేశంలో అడుగుపెట్టగానే ఆరంభమైనవి గుసగుసలు ప్రతిచోట అసంతృప్తి ప్రబలినది ప్రజాభిప్రాయం సమాదరించవలె, ఆర్లాండో ప్రవర్తనమిక్కిలి అసంతృప్తికరంగాయున్నది అని పదవిట్టినాడు ముస్సోలిని సామాన్య ప్రజాసంఘంలోనుంచి జొచ్చుకొని ముందుకువచ్చిన ముస్సోలిని గంభీరవాక్యాలు ప్రజలను ఆకర్షించినవి ఇతడి పలుకులలో సత్యంయున్నదని గ్రహించినారు ప్రజలు వెంటనే యితడికి జోహారులు సమర్పించినారు ప్రపంచ యుద్ధానికిపూర్వం ఇటలీదేశం పొందినకున్నతి, విశాలరోమక సామ్రాజ్యమునిరిగి నెలకొల్పవలెననే స్థిరదీక్ష, ముసోలిని చేయుసర్వ వ్యవహారములలోను ప్రతిబింబిస్తూ యుంటుంది ఇతనికి ప్రజావలంబము అధికముగాయున్నది నేడు ముసోలినివాక్కు, ఇటలీప్రజకు శాసనము. ఇటలీకేకాదు యూరపు రాజ్యాలన్నిటికీ వేదవాక్యము ముసోలినీ కంటియెఱుపు వీటికి సింహస్వప్నము ప్రపంచశాంతి, యుద్ధము విల్లిద్దరి చేతుల్లోనేయున్నది ఈమహాశక్తుల విజృంభణము, అంతర్జాతీయ రాజకీయము అనుతారుమారు చేస్తూయున్నది. ముసోలిని పదఘాటికి యూరపుఖండాలు అపరిమితభయములో కంపిస్తూయున్నవి అబిసీనియా ఆక్రమణము అక్రమమని సర్వదేశములు సానుభూతి కాలిబొబ్బరిని కాని ధైర్యంతో ఇటలీకి చెప్పగలిగిన దేశం ఒక్కటిలేదు ఒకవంతుడితోపోరు అందరికీ భయమే

జపాను రాజ్యవిస్తరణాభిలాష విపరీత పరిణామం పొందుతూయున్నది తనదేశంలో ప్రజకు చాలినవసతిలేక ౭౫ లేక ౮౦ మిలియనుల జనసంఖ్యకలిగిన బ్రహ్మాండపాను స్వజ

సమీపరాజ్యములు కబళించడానికి పూనుకొనినది ౧౯౩౧వ సంవత్సరంలో జపాను మంచూరియాను ఆక్రమించినది, అందరు జపాను కృత్యాన్ని నిరసించినారు ఇంగ్లండుకూడా జపాను వైఖరిని విమర్శించినది, కాని జపాను వీరిపట్ల చూపిన తూష్ణీభావం, ఇంగ్లాండు నానాటికి కోల్పోతూయున్న అధికారగౌరవాన్ని సూచిస్తూంది.

పూర్వం అమెరికా, ఇంగ్లాండు దేశాలు చేసిన పనినే ప్రస్తుతం జపానుకూడ చేస్తూయున్నది రాజ్యవిస్తరణాభిలాష యూరోపు తరువాత అమెరికాదేశం, స్వీయసంపదల అభివృద్ధికోసం, కృషిసలుపుతూ యున్నది. ఇంగ్లాండు, తనప్రజల జీవితంకోసం యితరదేశాల మీద ఆధారపడి యుంటూంది ఇంగ్లాండులో నివసించే ప్రతిపురుషుడూ, స్త్రీ, పౌనుకు అయిదుషిల్లింగులు ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో హిందూదేశం నుంచే పొందుతున్నారు బీదతనం అనుభవిస్తూ, పరాధీన స్థితియందున్న హిందూదేశానికి యిది కఠినమైన యెత్తు. ఎంత యుదారదృష్టితో చూచినా జపాను ప్రస్తుతం ఉత్తరచైనాలో సలుపుతూయున్న విలయతాండవం క్షంతవ్యముకాదు. ప్రపంచ వాణిజ్యాశ్రయములను ధిక్కరించగలిగిన జపాన, సామ్రాజ్యతృష్ణ నరికట్టడానికి అపరిమిత తృష్ణగల మరియొక దేశమే కరణ్యమౌతుంది

### చీనావారి నష్టములు

షాంఘాయి ౨౬ అక్టోబరు

౨౫ అక్టోబరువరకు చీనావారికి కలిగిన మొత్తము నష్టము ౨లక్షల ౫౦ వేలైయుండెను. వీనిలో ౭౫వేల మంది రణరంగమున బలియైరి నియూహా, షాంఘాయి, సోషోయందు మొత్తము ౫,౭౦ లక్షలమందిసైనికులుండినటుల జపానుపత్రికలు తెలుపుచున్నవి

### అనేక ప్రదేశములు జపానువారి స్వాధీనమగుట

షాంఘాయి ౨౬ అక్టోబరు

అనేక ముఖ్యప్రదేశములు జపానువారి స్వాధీనమైనటుల వార్తలుగలవు. ఉత్తరంతేపు చీనా సైనికులలో నిరుత్సాహము ప్రబలియున్నది అంతర్జాతీయ ప్రదేశమునకు పదిమైళ్ల దూరమున చీనాసేనలు జపానుసేనల ఆధీనమైనటులగలవు వీరి శస్త్రములు లాగుకొనబడవచ్చును లేదా వీరంత రంతము కావచ్చును

### బ్రిటిషు కార్యాలయముపై బాంబులు

షాంఘాయి ౨౬ అక్టోబరు

ఒక జపాను విమానమునుండి తెల్లీవు సాయ్కావు సమీపమందలి బ్రిటిషువారి కార్యాలయముపై బాంబులు విసరబడినవి బ్రిటిషువారు విమానముపై తిరంగుల ప్రేల్చిరి. అతివేగముతో విమాన మెగిరిపోయెను

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy